


చీనాదేశంలోని ఒక మహానగరంలో పూర్వం ముస్తఫా అనే దర్జీ ఒకడుండేవాడు. అయన చాలా బీదవాడు. రోజల్లా శ్రమపడినా తన సంపాదనతో తన భార్యనూ కుమారుణ్ణీ పోషించలేకపోయే వాడు.

ముస్తఫా కొడుకుపేరు అలాదీన్. వాడు అపరిమితమైన సోమరి. దానికితోడు వాడికి కాస్తయినా లక్ష్యంలేదు. తలిదండ్రులమాట కొంచెమైనా వినేవాడుకాడు. వాడు తెల్లవారుతూనే బయటికి వెళ్ళేవాడు, రోజల్లా తనలాటి సోమరి పిల్లలను వెంటవేసుకుని వీధుల్లోనూ, మైదానాల్లోనూ ఆటలాడేవాడు.

అలాదీన్‌కు పని నేర్చుకునే వయసు రాగానే వాడి తండ్రి వాణ్ణి తన దుకాణానికి తీసుకుపోయి, సూదితో కుట్టటం నేర్పాడు. కాని వాడు కుదురుగా కూచుని పనిచేసే లాగు చెయ్యటం తండ్రివల్ల కాలేదు. తండ్రి కాస్త కనుచాటు అయితే చాలు, బయటికి జారుకుని ఇక ఆ రోజల్లా కనపడేవాడు కాడు. ముస్తఫా కొట్టిచూశాడు. కాని అలాదీన్ చాలా మొండిఘటం. చివరకు, చేసేది లేక, ముస్తఫా తన కొడుకును వదిలేసి ఊరుకున్నాడు. సగం వాణ్ణిగురించిన మనోవ్యాధితోనే ముస్తఫా మంచంపట్టి, కొద్ది నెలలు తీసుకుని చనిపోయాడు.

తండ్రి పోయాక అలాదీన్‌కు బొత్తిగా అదుపూ, ఆజ్ఞా లేకుండాపోయింది. ఇప్పుడు వాడు రోజల్లా వీధుల్లోనే గడుపుతూ, తన

వి. ప్రసాదరావు



యీడు పిల్లలను వెంటవేసుకు తిరగసాగాడు. పదిహేనేళ్లు నిండిసదాకా వాడి జీవితం ఇలాగే గడిచింది.

తన భర్త పోగానే ఆయన దుకాణం తన కొడుకుకు పనికిరాదు గనక దాన్ని అమ్మేసి, అలాదీన్ తల్లి నూలు వడికి అంతో ఇంతో సంపాదిస్తూ దానితో తనకొడుకును పోషిస్తూ వచ్చింది. తల్లి తన కోసం కష్టపడుతున్నదన్న ఙ్ఞానమైనా లేకుండా అలాదీన్ అస్తమానం ఆటలలో గడుపుతూండేవాడు.

ఒకనాడు అలాదీన్ తనయీడు పిల్లలతో కలిసి వీధిలో ఆడుతూండగా ఆ దారిన వెళ్లే ఒక మనిషి ఆగి అతణ్ణి పరీక్షగా చూశాడు.



ఈ మనిషి ఆఫ్రికాఖండంలోని మొరాకో దేశంనుంచి వచ్చిన ఒక మూర్‌జాతివాడు. ఆయన ఒక గొప్ప మాంత్రికుడుకూడా. కాస్సేపు అలాదీన్‌ను పరీక్షించి, ఆ కుర్రవాడు తన పనికి ఉపయోగపడతాడని నిశ్చయించుకుని, ఆ మాంత్రికుడు అలాదీన్ స్నేహితులద్వారా అలాదీన్ పేరూ, ఇతర వివరాలూ తెలుసుకున్నాడు.

తరవాత ఆయన అలాదీన్‌ను సమీపించి, "నాయనా, నువు ముస్తఫా అనే దర్జీకి కొడుకువు కాదూ?" అని అడిగాడు.

"అవునండి. ఆయన పోయి చాలాకాలమయింది," అన్నాడు అలాదీన్.

ఈమాట వినగానే మాంత్రికుడు అలాదీన్‌ను కౌగలించుకుని, చెంపలమీద ముద్దుపెట్టుకుని, ఘోరున కన్నీరు కార్చసాగాడు.

"ఎందుకండి ఏడుస్తున్నారూ? మీకు మా నాన్న తెలుసా?" అని అలాదీన్ మాంత్రికుణ్ణి అడిగాడు.

"ఎంతమాట అడిగావురా, నాయనా? నా సొంత అన్న చచ్చిపోయాడని వినేసరికి ఏడుపురాదా మరి? ఎన్నో ఏళ్లుగా దూరదేశాలలో సంచారంచేసి మా అన్నను ఒక్కసారి కళ్లా జూతామని నేనువస్తే, నువేమో ఆయన పోయినాడంటివి! అయితే నిన్ను



చూడగానే మా అన్న కొడుకువని పోల్చుకున్నాను సుమా. మీ నాన్న ఇంకా పెళ్లి కాకముందే, అంటే నలభైఏళ్ల క్రితం, నేను దేశంవదలి వెళ్లాను. అయినా నిన్ను చూడగానే అచ్చు మా అన్నను చూసినట్లే అయింది. నాకిక నువ్వుతప్ప ప్రపంచంలో ఇంకెవరూ లేరు. నిన్ను చూసుకుని మా అన్నను చూసినట్టే సంతోషిస్తాను!" అంటూ మాంత్రికుడు పది బంగారు నాణాలు తీసి అలాదీన్ చేతిలో పెట్టి, "ఈ డబ్బు మీ అమ్మకియ్యి. నేను దేశంలోకి వచ్చాననీ, ఆవిడను అడిగాననీ చెప్పు, ఏం? నేను రేపు మీ యింటికి వచ్చి ఆవిడను పరామర్శిస్తాను; మా అన్న ఉండిన ఇల్లు చూసి సంతోషిస్తాను," అన్నాడు.

మాంత్రికుడిచ్చిన సొమ్ము చూడగానే అలాదీన్‌కు పరమానందమయింది. భోజనం వేళకుగాని ఇల్లు చేరనివాడు, ఆ రోజు ముందుగానే ఇంటికి పరిగెత్తి, "అమ్మా, దూరదేశంనుంచి చిన్నాయన వచ్చాడే! రేపు నిన్ను చూడ వస్తాట్ట!" అన్నాడు.

"నీకేమైనా మతి చెడిందిరా, నాయనా? నీకు చిన్నాయన ఎవరున్నారూ? మీ నాన్నకు అన్నదమ్ము లెవరూ లేరుగా?" అన్నది తల్లి.

"బాగా చెప్పావులేవమ్మా. ఆయన నా చిన్నాయనే. నన్ను దగ్గిరికి తీసుకుని ముద్దు చేశాడు. నాన్న చచ్చిపోయాడంటే ఏడిచాడు. తాను వచ్చిన సంగతి నీతో చెప్పమన్నాడుకూడా!" అన్నాడు అలాదీన్.

మర్నాడు ఉదయమే మాంత్రికుడు అలాదీన్‌కోసం వెతుకుతూ నగరపు వీధుల వెంట బయలుదేరాడు. కొంతసేపు ఆ వీధీ ఈ వీధీ తిరిగినమీదట ఆయనకు ఒకచోట అలాదీన్, అతని స్నేహితులూ కనిపించారు. మాంత్రికుడు అలాదీన్‌ను మళ్లీ దగ్గిరికి తీసుకుని ముద్దుపెట్టుకుని, రెండు బంగారు నాణాలు వాడి చేతిలో పెట్టి, "ఇది తీసుకు

పోయి మీ అమ్మకియ్యి. అవసరమైన వస్తువులన్నీ కొని వంటచేసి సిద్ధంగా ఉంచమను. ఈ రాత్రికి నేను భోజనానికి వస్తున్నానని చెప్పు. అన్నట్టు, మీ ఇంటికి దారి చూపించు," అన్నాడు.

అలాదీన్ అలాగేనని మాంత్రికుడికి తన ఇంటిదారి, గుర్తులూ చెప్పి, రెండు బంగారు నాణాలూ తీసుకుని తల్లిదగ్గరకు పరిగెత్తివెళ్ళి, "అమ్మా, చిన్నాయన సాయంకాలం మనింటికి భోజనానికి వస్తున్నాడు!" అని చెప్పాడు.

తల్లి అప్పటికప్పుడే బయలుదేరి బజారుకు వెళ్ళి వంటసామగ్రి ఏమేమి కావాలో అవంతా కొనుక్కు వచ్చింది. ఆ పేద కొంపలో వంటపాత్రలకుకూడా కరువే; అందుచేత ఆవిడ ఇరుగుపొరుగు ఇళ్ళనుంచి పాత్రసామాను అరువు తెచ్చుకుని, వంట ప్రారంభించింది.

చీకటి పడింది. అలాదీన్‌తో తల్లి, "వంట పూర్తి అయింది, నాయనా! ఒకవేళ మీ చిన్నాయనకు మనింటిదారి తెలుసో, తెలీదో, నువ్వాయనకోసం బయలుదేరి పోతావా ఏమిటి?" అన్నది.

అలాదీన్ బయటికి పోవటానికి సిద్ధమవుతుండగా వాకిలి తలుపు తట్టిన చప్పుడయింది. అలాదీన్ వెళ్ళి తలుపు తీశాడు; మాంత్రికుడు బోలెడన్ని పళ్ళూ ఫలాలూ,



పానీయాలూ కూలివాడిచేత పట్టించుకుని లోపలికి వచ్చాడు.

మాంత్రికుడు కూలివాణ్ణి పంపేసి అలాదీన్ తల్లిని పలకరించాడు. తరవాత ఆయన గుడ్లనీళ్ళు నింపుకుంటూ, "మా అన్నగారు ఎక్కడ కూచునేవారో దయచేసి చూపిస్తారా, వదినెగారూ?" అని అడిగాడు.

అలాదీన్ తల్లి మాంత్రికుడికి ముస్తఫా కూచుంటూ ఉండిన స్థలం చూపింది. వెంటనే మాంత్రికుడు ఆ స్థలందగ్గిర మోకరిల్లి, దణ్ణంపెట్టి, కళ్ళను అద్దుకుని, కంటి వెంట నీరుకారుస్తూ, "అయ్యో, అన్నా! నేను ఎంత పాపంచేశానో, నువ్వు బతికుండగా రాలేకపోయాను, ఎంత అభాగ్యుణ్ణి!" అని ఒక శోకంపెట్టాడు.

"నువ్వు ఆచోటులోనే కూర్చో నాయనా!" అన్నది అలాదీన్ తల్లి.

"లేదు. నేను అక్కడకూచోను! మీరేమీ అనుకోకుంటా ఉంటే దానికెదురుగా కూచుంటాను. ఆయనకెదురుగా కూచునే భాగ్యం లేకపోతే మానె, ఆయన కూచునే చోటికెదురుగా కూచునే భాగ్యమైనా నాకు దక్కనివ్వండి!" అన్నాడు మాంత్రికుడు.

ఈ వగల ఏడుపులు చూసి అలాదీన్ తల్లి ఆ మనిషి నిజంగా తన భర్తకు తమ్ముడేనని నమ్మసాగింది. చివర కావిడ,





"ఎందుకేడుస్తావు, నాయనా? ఊరుకో! చచ్చినవారితో చావలేంగదా!" అంటూ మాంత్రికుణ్ణి ఊరడించింది.

మాంత్రికుడు ఆవిడతో, "చూడండి, వదినా. మీరు మా అన్నను పెళ్ళాడి, ఆయనతో కాపరంచేసిన ఇన్ని ఏళ్ల కాలంలోనూ నన్ను ఒక్కసారయినా చూడనందుకు మీరేమీ ఆశ్చర్యపడవద్దు. ఎందుచేతనంటే నేను దేశం విడిచిపెట్టి నలభై ఏళ్లయింది. నేను ఇండియా, ఇరాన్, అరేబియా, సిరియా, ఈజిప్టు మొదలైన దేశాలన్నీ తిరిగాను. కైరోనగరంలో చాలా ఏళ్లున్నాను. అటువంటి నగరం ప్రపంచంలో మరొకటి ఉండదనుకోండి. చిట్టచివరకు నేను మొరాకోదేశం చేరి, ముప్పై ఏళ్లుగా అక్కడే నివాసం ఏర్పరుచుకున్నాను. ఒకనాడు ఒంటరిగా కూచుని ఏదో ఆలోచిస్తూవుండగా చటుక్కున మన దేశమూ, మా అన్నా జ్ఞాపకం వచ్చారు. వెంటనే నాకాయనను చూడాలనిపించింది. ఏవేవో ఆలోచనలు వచ్చాయి. ఆయనను చూడకుండానే చనిపోతానేమోనని బెంగ పుట్టింది. దేవుడి కృప వల్ల నేను ఇంత ధనం సంపాదించుకున్నప్పటికీ, మా అన్న ఒకవేళ దారిద్ర్యంతో బాధ పడుతున్నాడేమోనని మరొక బెంగ పట్టుకున్నది. ఇంకేముంది? వెంటనే బయలుదేరి వచ్చాను! నేను దారిలో పడిన కష్టాలన్నీ ఇప్పుడు చెప్పటం దేనికిలే. ఎలాగైతేనేం, మొన్న ఈ నగరం చేరాను. వీథిలో వెళుతూండగా నాకు మన అలాదీన్ కొందరు కుర్రాళ్లతో ఆడుకుంటూ, కనిపించాడు. నమ్మండి, నమ్మకపోండి, వాణ్ణి చూస్తూనే గుర్తుపట్టాను. నా గుండె ఆనందంతో గంతులేసింది; కాని వాడు మా అన్న చచ్చిపోయినట్టు చెప్పగానే నాకు ఎక్కడలేని దుఃఖమూ వచ్చేసింది. ఆపుకో లేకపోయాను—బహుశా మనవాడు చెప్పే ఉంటాడు. అయినా మా అన్నకు ప్రతి



రూపంగా అలాదీన్ ఉన్నాడుగదా అని సంతోషించాను. ఎందుకంటే వాడు మూడు మూర్తులా మా అన్న పోలికే!" అన్నాడు.

ఈ మాటలన్నీ వింటూంటే అలాదీన్ తల్లికికూడా కళ్లు తడిఅయాయి. ఇది గమనించి మాంత్రికుడు ప్రసంగం మారుస్తూ, అలాదీన్‌తో, "నాయనా, అలాదీన్, నువ్వు ఏం వృత్తి నేర్చుకున్నావు? నీ పొట్టపోసుకుంటూ నీ తల్లిని పోషించడానికిగాను ఏం పని చేద్దామనుకుంటున్నావు?" అని ఆప్యాయంగా అడిగాడు.



ఈ ప్రశ్న వినగానే అలాదీన్ తల వంచుకున్నాడు. తరవాత తన తల్లి అన్న మాటలకు వాడిమొహం సిగ్గుతో జేవురించింది.

"అడగక అడగక అలాదీన్‌మాటే అడిగావా, నాయనా? వాడికి ఒక్కటి చేతగాదు. అంత పనికిమాలినవాణ్ణి నేనెక్కడా చూడలేదు. పోకిరివెధవల సందరినీ చేర్చి అస్తమానం వీధుల్లో ఒకటే ఆటలు! వాడికి కుట్టుపని నేర్పుదామని వాళ్ల నాన్న పడిన పాట్లు ఇన్నీ అన్నీ కావు. వీడిమూలంగానే ఆయన ఆయుస్సు అర్ధాయుస్సయిపోయింది. ఎప్పుడో నావంతుకూడా వస్తుంది. ఏం చెప్పేది, నాయనా? రాత్రీ పగలూ నేను నూలువడికినా మా పొట్టకు రెండు రొట్టెలు దొరక్కుండా ఉన్నాయి. వీడు చూడబోతే తిండికోసం తప్ప ఇంటికి రాడు. వాడు అంత ఇల్లుపట్టకుండా తిరుగుతున్నాడు. చూసి చూసి వాణ్ణి వదిలేసి ఊరుకుందామనుకుంటున్నాను. వాడి పోషణ నావల్ల అయేటట్టు లేదు. వాడి పొట్ట వాణ్ణే పోసుకోనీ! నేను పెద్దదాన్నయిపోతున్నాను, ఒంట్లో శక్తి తగ్గిపోతున్నది!" అని అలాదీన్ తల్లి విసుక్కున్నది.

మాంత్రికుడు అలాదీన్‌కేసి తిరిగి, "ఇదేమన్నా బాగుందా, నాయనా? మీ నాయన కడుపున పుట్టి, మంచి తెలివితేటలు గల వాడివైవుండీ ఇలా ప్రవర్తించవచ్చా? నువ్వు ప్రయోజకుడివై మీ అమ్మను పోషించాలి

గాని, నీ బరువు మీ అమ్మను మొయ్యమన వచ్చునా? చేసుకోదలిస్తే ఎన్నిరకాల పను లైనా ఉన్నాయి. నీ యిష్టంవచ్చిన పని నేర్చు కుంటానన్న, అది నీకు నేర్పించే భారం నాదీ! మీ నాన్నలాగా దర్జీపని చెయ్యటం ఇష్టంలేక పోతే ఇంకొకటి చూడు. నేను సహాయం చెయ్యటానికి సిద్ధంగా వున్నాను!" అన్నాడు.

దీనికి అలాదీన్ ఏ సమాధానమూ చెప్ప లేదు. వాడికి వళ్ళువంచి పనిచెయ్యటం ఇష్టంలేదని మాంత్రికుడు గ్రహించి, "నీకు వృత్తివిద్యలు నేర్చుకోవటం ఒకవేళ ఇష్టం లేదూ, మానెయ్యి! దానికేం? నీకు మంచి బట్టల దుకాణం ఏర్పాటుచేసి అందులో సిల్కులు నింపేస్తాను. హాయిగా వ్యాపారం చేసుకో!" అన్నాడు.

ఈసారి అలాదీన్ ముఖం వికసించింది. మంచి మంచి బట్టలు ధరించి గల్లాపెట్టె దగ్గిర కూచుని వర్తకు డనిపించుకోవటం సరదాగా తోచింది. వాడు మాంత్రికుణ్ణి చూచి చిన్ననవ్వు నవ్వి, సరేనన్నట్టు తల ఆడించాడు.

"సరే, ఇంకేం? రేపు నిన్ను బజారుకు తీసుకుపోతాను. గొప్ప వర్తకులు వేసుకునే దుస్తులు కొనిపెడతాను. ఆ తరవాత మంచి దుకాణం ఒకటి ఏర్పాటు చేస్తాను," అన్నాడు మాంత్రికుడు.

ఈ కొత్తబంధువు చెపుదల్లె ఇష్టపడినందుకు అలాదీన్ తల్లి ఎంతో సంతోషించింది. ఆయనను చాలాసేపు కొనియాడి, అలాదీన్తో, "మీ చిన్నాయన నీకోసం ఎంత శ్రమపడుతున్నాడో చూడరా! ఆయన పేరు నిలబెట్టటానికైనా ఇకనుంచి బుద్ధిగా ఉండి, ఆయన చెప్పినట్టల్లా చెయ్యి," అన్నది.

తరవాత ఆమె వడ్డించింది. ముగ్గురూ తృప్తిగా భోజనం చేశారు. చాలాసేపు ఆ కబుర్లూ ఈ కబుర్లూ మాట్లాడి, మర్నాడు ఉదయం వస్తానని చెప్పి మాంత్రికుడు తన బసకు వెళ్ళిపోయాడు. (ఇంకావుంది)



# అద్భుతదీపం

**2**

[చీనాదేశంలో అలాదీన్ అనే పేద కుర్రవాడుండేవాడు. వాడి తండ్రి పోయాడు. తల్లి వాణ్ణి ఎంతో శ్రమపడి పెంచుతున్నది. వాడు అస్తమానమూ వీధులలో తన యీడు కుర్రవాళ్లతో చేరి ఆడుతూ తల్లికి ఏవిధంగానూ ఉపయోగపడకుండా తిరుగుతూ ఉండేవాడు. ఇంతలో ఆ ఊరికి మొరాకోదేశంనుంచి ఒక మాంత్రికుడు వచ్చాడు. అలాదీన్‌తో వాడికి పని ఉన్నది. అందుచేత అలాదీన్ పినతండ్రినని చెప్పుకుని, అలాదీన్ తల్లి పరిచయం చేసుకున్నాడు. ఈ కొత్తచుట్టం తన కొడుకును ప్రయోజకుడు చేస్తాడని ఆమె నమ్మింది.]

ఆరాత్రి అలాదీన్‌కు ఆనందోద్రేకంతో నిద్ర పట్టనేలేదు. తెల్లవారుతూనే ఎవరో తలుపు తట్టారు. అలాదీన్ తల్లి వెళ్లి తలుపు తీసింది. బయట మాంత్రికుడున్నాడు. అతను, "అలాదీన్ ఏం చేస్తున్నాడు?" అని అడిగాడు. ఈ ప్రశ్న వింటూనే అలాదీన్ ఒక్క పరుగున బయటికి వచ్చి తన "చిన్నాయన"ను వాటేసుకున్నాడు.

తరవాత మాంత్రికుడు అలాదీన్ చెయ్యి పట్టుకుని బజారుకు తీసుకువెళ్ళాడు. ఇద్దరూ ఒక దుస్తుల దుకాణంలోకి వెళ్ళారు. "మావాడికి మంచి ఖరీదైన దుస్తులు కొన్ని చూపండి!" అని మాంత్రికుడు దుకాణుదారును అడిగాడు. దుకాణుదారు చాలా వెల గల దుస్తులు కొన్ని తీసి చూపాడు. "వీటిలో నీకు ఏది నచ్చితే అది తీసుకో!"

వి. ప్రసాదరావు





అన్నాడు మాంత్రికుడు. అలాదీన్ అన్నిటిలోకీ మంచివిగా ఏరి తీసుకున్నాడు. మాంత్రికుడు వాటి ఖరీదు ఇచ్చేశాడు.

అక్కడినుంచి బయలుదేరి ఇద్దరూ స్నానశాలకు వెళ్ళారు. అలాదీన్ స్నానం పూర్తిచేసి కొత్త దుస్తులు వేసుకున్నాడు. ఆ దుస్తులు చూసుకుని వాడు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు, ఎందుచేతనంటే వాడు తన జన్మలో అలాటి దుస్తులు ధరించి ఎరగడు.

తరవాత ఇద్దరూ కలిసి వర్తకుల వీధికి వెళ్ళారు. అక్కడ వర్తకులు క్రయవిక్రయాలు ఏవిధంగా సాగించేదీ అలాదీన్‌కు మాంత్రికుడు చూపించాడు. "నాయనా, నువ్వుకూడా రేపు వర్తకుడివి కాబోతున్నావు గనక ఈ వీధికి తరుచుగా వస్తూ, ఈ వర్తకులతో పరిచయం సంపాదించాలి!" అని మాంత్రికుడు అలాదీన్‌ను హెచ్చరించాడు.

మధ్యాన్నం అయేదాకా ఇద్దరూ నగరంలో వింతలన్నీ చూశారు, పెద్దపెద్ద భవనాలూ, మసీదులూ సందర్శించారు. తరవాత వారొక భోజనశాలకు వెళ్ళారు. అక్కడ భోజనం పూర్తి కాగానే మాంత్రికుడు అలాదీన్‌ను రాజభవనం చూడటానికి తీసుకువెళ్ళాడు. ఈ భవనం చుట్టూ అందమైన ఉద్యానవనాలున్నాయి.

ఇవి చూడటం అయిపోయాక మాంత్రికుడు అలాదీన్‌ను విదేశీ వర్తకులుండే విడిదికి తీసుకుపోయాడు. ఆ సాయంకాలం ఆయన ఆ విడిదిలో ఉండే విదేశీ వర్తకుల నందరినీ విందుకు పిలిచి, భోజన సమయంలో అలాదీన్‌ను వారికి పరిచయం చేస్తూ, "వీడు నా అన్నగారి కుమారుడు!" అని చెప్పాడు.

చీకటి పడే సమయానికి మాంత్రికుడు అలాదీన్‌ను ఇల్లు చేర్చాడు. తన కొడుకు వేసుకున్న కొత్త దుస్తులు చూసి అలాదీన్ తల్లి ఆనందం పట్టలేకపోయింది. "మరిదీ,

నీ ఋణం మేమెన్నటికీ తీర్చుకోలేం!" అన్నదామె.

"ఇందులో ఋణమేముంది, వదినా? వాడు నాకుమాత్రం కొడుకుకాడా? వాడికి తండ్రి ఏమి చేసేవాడో అంతకంటె హెచ్చు నేనేమీ చెయ్యటంలేదు. వాడి భవిష్యత్తు గురించి నీకు ఎటువంటి బెంగా వద్దు!" అన్నాడు మాంత్రికుడు.

"నీకడుపు చల్లగా, నూరేళ్లు బతుకు, నాయనా! వాడిభారం నీదే! వాడు నువ్వు చెప్పినట్టల్లా విని నీ పేరు నిలబెడితే అంతే చాలు!" అన్నది అలాదీన్ తల్లి.

"అలాదీన్ ఇప్పుడెంతమాత్రమూ చిన్న పిల్లవాడు కాడు, వాడు పెద్దవాడయాడు. నేను కోరేదల్లా ఏమంటే, వాడు వాడి నాన్న లాగే పరువు మర్యాదలు సంపాదించుకుని, ముసలితనంలో నిన్ను సుఖపెట్టాలని! రేపు శుక్రవారం గనక దుకాణాలు మూసేస్తారు. ఎల్లుండి అలాదీన్‌చేత దుకాణం తెరిపిస్తాను. రేపు ఉదయం వచ్చి వాణ్ణి తీసుకుపోతాను. నగరం వెలపల ఉన్న తోపులు చూసివస్తాం. అక్కడికి గొప్పగొప్ప వాళ్లంతా శలవురోజు వనవిహారాలకూ, వన భోజనాలకూ వస్తారు. మనవాణ్ణి వాళ్లకు పరిచయం చేస్తాను!" అని చెప్పి, మాంత్రికుడు



అలాదీన్ తల్లివద్ద సెలవు పుచ్చుకుని తన బసకు వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి అలాదీన్ తన భవిష్యత్తును గురించి రకరకాలుగా ఊహించుకుంటూ నిద్రపోయి, మర్నాడుదయం పెందలాడే లేచాడు. మాంత్రికుడు వచ్చి తలుపు తట్టి నప్పుడు వాడే వెళ్ళి తలుపు తెరిచాడు. మాంత్రికుడు వాణ్ణి కౌగలించుకుని, "నాయనా, ఇవాళ నువ్వు నీ జన్మలో ఊహించలేని వింతలు చూడబోతున్నావు!" అన్నాడు ఉత్సాహంగా.

ఇద్దరూ చేతులు పట్టుకుని నడుచుకుంటూ నగరద్వారం దాటివచ్చారు. నగరం



వెలుపల విశాలమైన ఉద్యానవనాలూ, మధ్య మధ్య సంపన్నుల భవనాలూ ఉన్నాయి. అలాదీన్ వీటినెప్పుడూ చూసి ఉండలేదు. ఒక్కొక్క భవనాన్నే చూసినప్పుడల్లా వాడు విస్మయం చెందసాగాడు.

నగరం దాటి చాలాదూరం వెళ్ళి వాళ్ళు అలిసిపోయారు. విశ్రాంతికోసం వాళ్ళు ఒక ఉద్యానవనం ప్రవేశించారు. అక్కడ ఒక అందమైన జలయంత్రమూ, దానిచుట్టూ తళతళలాడే ఇత్తడిసింహాలూ ఉన్నాయి. మాంత్రికుడు తన రొండినుంచి ఒక సంచీ తీసి, అందులోనుంచి పళ్ళూ తినుబండారాలూ అలాదీన్‌కిస్తూ "ఆకలిగా ఉందేమో, వీటిని తిను, బాబూ!" అన్నాడు. ఫలహారం అయాక ఇద్దరూ మళ్ళీ ప్రయాణంసాగించారు.

"మనం ఇంకా ఎంతదూరం వెళ్ళాలి, చిన్నాయనా? తోటలన్నీ దాటి వచ్చేశాం. ముందుకుపోతే ఆ ఎదురుగా కనిపించే కొండ తప్ప ఇంకేమీలేదు. మనం ఇక తిరిగిపోదాం. నడిచి నడిచి నా కాళ్ళు తెగలాగుతున్నాయి" అన్నాడు అలాదీన్.

"మగవాడివి కావ్రటా? అలా దిగజారిపోతావేం? నీ కింకోరకం ఉద్యానవనం చూపించబోతున్నాను. నువ్వు చూసిన అన్ని ఉద్యానవనాలకన్న కూడా అది అందమైనది. ప్రపంచంలో ఏ మహారాజువద్దా

అటువంటి ఉద్యానవనం ఉండదు!" అన్నాడు మాంత్రికుడు. అలాదీన్‌కు మార్గక్రమ తెలియకుండా ఉండేందుకు మాంత్రికుడు చిత్ర విచిత్రమైన కథలు చెప్పాడు. ఇంతలో ఇద్దరూ ఒక చోటికి వచ్చి చేరారు. ఈ చోటు చూడటానికే ఆ మాంత్రికుడు మొరాకో దేశంనుంచి చీనాదేశానికి వచ్చాడు.

"మనం చేరవలసిన చోటికి చేరుకున్నాం. కాస్సేపు విశ్రాంతి తీసుకో. ఆ తరవాత నీకు ఎన్నో అద్భుతాలు చూపిస్తాను. అటువంటి అద్భుతాలను మానవ మాత్రుడెవడూ ఎన్నడూ ఊహించి అయినా ఉండడు!" అన్నాడు మాంత్రికుడు.

అలాదీన్ కాస్సేపు విశ్రాంతి తీసుకున్నాక మాంత్రికుడు అతన్ని ఎండు కట్టెలూ, చితుకులూ ఏరుకు రమ్మన్నాడు. వాటితో మంట చేశాక ఎన్నో అద్భుతాలు చూపుతానన్నాడు.

తన "చిన్నాయన" ఏం వింతలు చూపుతాడా అని ఆశ్చర్యపడుతూ అలాదీన్ చుట్టూ ఉన్న పొదలలోకి వెళ్ళి, చితుకులూ ఎండు పుల్లలూ ఏరి, పెద్ద మోపుకట్టి తెచ్చి మాంత్రికుడిముందు పెట్టాడు. మాంత్రికుడు ఆ పుల్లలతో నిప్పుచేసి, అది పెద్ద జ్వాల అయినాక, ఒక డబ్బీలోనుంచి చిటికెడు గుగ్గిలం మంటలో చల్లుతూ, ఏవో మంత్రాలు చదివాడు.





వెంటనే ఆకాశం చీకటి అయిపోయింది. భూమి దద్దరిల్లింది. మరుక్షణం నేల విచ్చు కుని, లోపలగా ఒక చలువరాతి పలక కని పించింది. ఆ పలకలో ఒక రాగి వలయం అమర్చి ఉన్నది.

ఇదంతా చూసి అలాదీన్‌కు మతి పోయి నట్టయింది. వాడు పారిపోవటానికి ప్రయ త్నించాడు. కాని మాంత్రికుడు వాణ్ణి పట్టు కుని, వాడి నెత్తిమీద పిడికిలితో బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు అలాదీన్ స్పృహతప్పి పడిపోయాడు. మాంత్రికుడు తన మంత్ర శక్తితో వాడికి స్పృహ తెప్పించవలసి వచ్చింది. అలాదీన్ కళ్లుతెరిచి, "నేనేం



తప్పుచేశానని నన్ను కొట్టావు, చిన్నాయనా?" అని అడిగాడు.

మాంత్రికుడు మృదువుగానే జవాబిస్తూ, "నాయనా, నువ్వు కుర్రతనం వదిలించు కుని మగతనం సంపాదించాలనే ఉద్దేశంతో కొట్టాను. నేను నీ తండ్రికి తమ్ముణ్ణి, నీకు చిన్నాయనను. నా మాట వినటం నీ విధి. నేను చెప్పినట్టు చేస్తివా నిన్ను ప్రపంచంలో ఉండే చక్రవర్తులందరికంటెకూడా ధనికుణ్ణి చేస్తాను. కనక నేను చెప్పేది జాగ్రత్తగా విను. నా మంత్రాల మహిమవల్ల భూమి ఎలా విచ్చుకున్నదీ నువ్వు చూశావుగద! ఆ కనపడే రాతిపలక అడుగున ఒక గొప్ప నిధి ఉన్నది. దానిని పైకితీసే శక్తి నీకు మాత్రమే ఉన్నది. ఆ రాతిని నువ్వుమాత్రమే ఎత్తి దానికింద ఉండే మెట్లు దిగి వెళ్లగలవు. సరిగా నేను చెప్పినట్టు చెయ్యి, రాతికింద ఉన్న ధనాన్ని మనమిద్దరమూ పంచు కుందాం!" అన్నాడు.

ఈ మాటలతో అలాదీన్ తనకు తగిలిన దెబ్బకూడా మరిచిపోయి, "ఏం చెయ్యాలో చెప్పు, చిన్నాయనా. నువ్వు చెప్పినట్టే చేస్తాను!" అన్నాడు.

మాంత్రికుడు అలాదీన్‌ను దగ్గిరికి తీసు కుని ముద్దుపెట్టుకుని, "నాయనా, నువ్వు





నాకు కొడుకుకన్న ఎక్కువైనవాడవు. నాకు ప్రపంచంలో నువ్వు తప్ప వేరే బంధువు లేడు. నాకు నువే వారసుడవు. నిన్ను చూద్దామని, ధనవంతుణ్ణి చేద్దామని ఇంత దూరం వచ్చాను. చూడూ, ఆ రాతిలో ఉండే రాగి వలయాన్ని పట్టుకుని పైకెత్తు, రాయి పైకి వచ్చేస్తుంది!" అన్నాడు.

"అంత రాయిని నేను ఒక్కణ్ణే ఎత్తగలనా, చిన్నాయనా? నాకంత బలంలేదు. నువ్వుకూడా కాస్త సాయంపట్టు," అన్నాడు అలాదీన్.

"ఈ పని నీ ఒక్కడివల్లే కావాలి. నేను చెయ్యి పెట్టానో, మనం పడిన శ్రమ యావత్తూ నిరుపయోగమై పోతుంది. చెప్పాను కానా, ఆ రాతిని ఎత్తగలవాడివి ఈ ప్రపంచంలో నువ్వు ఒక్కడివే! రాయి పైకెత్తేటప్పుడు నీ పేరూ, మీ నాన్న పేరూ, మీ అమ్మ పేరూ ఉచ్చరించాలి," అన్నాడు మాంత్రికుడు.

అలాదీన్ తనకున్న బలమంతా వినియోగించి, మాంత్రికుడు చెప్పిన ప్రకారమే రాతిని పైకి ఎత్తాడు. అది అతనికి ఎక్కువ బరువు అనిపించలేదు. ఆ రాతిని తీయగానే దాని అడుగున పన్నెండు మెట్లూ, వాటి చివర ఒక ద్వారమూ కనిపించాయి.

అప్పుడు మాంత్రికుడు ఇలా చెప్పాడు:

"అలాదీన్, నేను చెప్పేది చాలా శ్రద్ధగా విను. అక్షరాలా నేను చెప్పినట్టే చెయ్యి. నా మాటలు వెంట్రుకవాసికూడా అతిక్రమించవద్దు. ఆ కనిపించే మెట్లు దిగి అడుగున ఉన్న గుహలోకి వెళ్ళు. అందులో పెద్ద చావడి ఉంటుంది. అది నాలుగు భాగాలుగా చేసివుంటుంది. వాటన్నిటిలోనూ వెండి బంగారాలు నింపిన హుండీలుంటాయి. నువ్వు అక్కడ క్షణంకూడా ఆగవద్దు; అక్కడి వస్తువులనుగాని, గోడలనుగాని తాకవద్దు; ఆఖరుకు నీ బట్టలుకూడా దేనికి తగలకుండా చూసుకో, పొరపాటున దేన్నయినా



తాకావో, మరుక్షణం నల్లరాయిగా మారి పోగలవు, జాగ్రత్త! చావడి చివరను ఒక ద్వారం కనిపిస్తుంది. రాయి ఎత్తేటప్పుడు ఉచ్చరించినట్టే నీపేరూ, మీ నాన్నపేరూ, అమ్మపేరూ వుచ్చరించి తలుపు తెరు. దాని అవతల చక్కని పళ్ళచెట్లు గల తోట కనిపిస్తుంది. ఈ తోటలో యాభై గజాల దూరం వెళ్లాక నీకు ముప్పై మెట్లు కనిపిస్తాయి. వాటిని ఎక్కిపోతే ఒక ఎత్తయిన దాబా కనిపిస్తుంది. ఈ దాబాకు ఎగువగా ఒక దీపం వేలాడగట్టి వుంటుంది. ఆ దీపాన్ని దించు. అందులో వుండే చమురు అవతల పారబొయ్యి. తరవాత దీపాన్ని నీ చొక్కా లోపల దాచు. ఆ దీపంలో వుండేది మామూలు చమురు కాదు, అందుచేత నీ బట్టలు పాడవుతాయని భయపడ నవసరం లేదు. వచ్చేటప్పుడు తోటలో నీకు కావలసిన పళ్లు కోసుకుని తెచ్చుకో!"

మాంత్రికుడు ఇదంతా చెప్పి, తన వేలి నుండి ఒక ఉంగరం తీసి అలాదీన్ వేలికి తొడుగుతూ, "నాయనా, ఈ ఉంగరం నిన్ను అన్ని అపదలనుంచీ రక్షిస్తుంది. నువు మటుకు అక్షరాలా నేను చెప్పినట్టే చెయ్యి. ఏమాత్రమూ భయపడకు, ధైర్యంగా వుండు. కొద్దిసేపట్లో నువు ప్రపంచంలోకెల్లా ధనవంతుడవు కాబోతున్నావు," అన్నాడు.





అలాదీన్ గుంటలోకి దూకి మెట్లు దిగి ద్వారంకుండా గుహలో ప్రవేశించాడు. మాంత్రికుడు చెప్పినట్టే ఒక పెద్ద చావిడి, నాలుగు విభాగాలు చేసివున్నది. ఒక్కొక్క విభాగంలోనూ ఒక్కొక్క హండీ వున్నది. ప్రతిదానిలోనూ బంగారం వున్నది. అలాదీన్ అక్కడ ఆగక, దేన్నీ తాకక, అతి జాగ్రత్తగా చావిడి దాటి తోటలో ప్రవేశించి, తరవాత మెట్లెక్కి డాబామీదికి వెళ్ళాడు. అక్కడ వేలాడగట్టివున్న లాంతరును దించి, అందులో వున్న చమురు పారబోసి, దీపాన్ని తన చొక్కాలోపల భద్రంగా దాచుకున్నాడు. తరవాత అలాదీన్ తోటలోకి తిరిగివచ్చి అక్కడి చెట్లను మొదటిసారి పరీక్షగా చూశాడు. ఆచెట్లమీద అన్నిరంగుల పళ్లూ వున్నాయి. కాని అలాదీనకు ప్రపంచజ్ఞానం లేకపోవటంచేత అవి నిజంగా పళ్లుకావనీ, నవరత్నాలనీ తెలుసుకో లేకపోయాడు. విలవ కట్టటానికి వీలులేని వజ్ర, వైడూర్య, మరకత, మాణిక్య, గోమేధిక, పుష్యరాగాలు ఆ చెట్లకొమ్మలకు పళ్ళలాగా వేలాడుతున్నాయి. అటువంటి రత్నాలు ప్రపంచంలో ఏ రాజువద్దా లేవు. వాటిని చూసి అలాదీన్ రంగురంగుల గాజుముక్కలనుకున్నాడు. వాటి విలవ తెలియకపోయినా, అవి వెదజల్లే రంగుల కాంతులు చూసి

అలాదీన్‌కు ఎంతో ముచ్చటవేసింది. అందుచేత వాడు వాటిని రెండుచేతులా కోసుకుని తన జేబులన్నీ నింపుకున్నాడు. తాను మోయగలిగినన్ని రత్నాలు తీసుకున్నాక వాడు బయలుదేరి గుహనుంచి బయటికి వచ్చి పన్నెండు మెట్లూ ఎక్కి గుంటలో ఆగాడు. గుంటలోనుంచి పైకి ఎక్కటం వాడికి సాధ్యంకాలేదు, ఎందుచేతనంటే వాడి జేబులనిండా అంతులేని రత్నాలు బరువుగా ఉన్నాయి.

"చిన్నాయనా, పైకి ఎక్కలేకుండా ఉన్నాను, చెయ్యిపట్టుకుని నన్ను పైకి లాగు!" అని అలాదీన్ కేకపెట్టాడు.

"లాంతరు బరువుగా ఉన్నదేమో, అది ముందు నాకిచ్చెయ్యి," అన్నాడు మాంత్రికుడు ఆదుర్దాగా.

"ఇప్పుడు దాన్ని పైకి తీయటం సాధ్యం కాదు. నన్ను పైకి, లాగేసినాక ఇస్తాను!" అన్నాడు అలాదీన్.

కాని మాంత్రికుడికి కావలిసింది లాంతరు. అది చేతికి రాకపోయేసరికి చిరాకుపడిపోతూ, "ఆ లాంతరు ముందిలా ఇయ్యి!" అని గదమాయించాడు. కాని జేబుల్లోనూ, చొక్కాలోపలా రత్నాలు నింపుకున్న అలాదీన్‌కు లాంతరు పైకి తీయటం సాధ్యంకాలేదు.

ఆ దీపాన్ని అలాదీన్ తనకే ఉంచుకోవాలనుకుంటున్నాడనుకుని మాంత్రికుడు మండిపడ్డాడు. "దుర్మార్గుడా, ఆ లాంతరు నాకివ్వకపోయావు గనక నీగతి ఏమిటో చూసుకో!" అంటూ, చితుకులమంట వద్దకు వెళ్ళి, ఏవో మంత్రాలు చదువుతూ అందులో ఇంత గుగ్గిలం చల్లాడు. మరుక్షణం చలపరాయి దబాల్న యథాస్థానంలో పడిపోయింది. దానిపై భూమి ఎప్పటిలాగే కప్పుకున్నది.

అలాదీన్ రహస్యగుహలో ఒంటరిగా చిక్కుకుపోయాడు. (ఇంకా వుంది)



# అద్భుతదీపం

## 3

[మొరాకోదేశంనుంచి చీనాకు వచ్చిన మాంత్రికుడు అలాదీన్ తల్లితో పరిచయం చేసుకుని, తాను అలాదీన్ పినతండ్రినని ఆమెను నమ్మించి, అలాదీన్‌ను గొప్పవాణ్ణి చేస్తానని మాట ఇచ్చి, నగరానికి దూరంగా తీసుకువెళ్లి అలాదీన్‌ను ఒక భూగర్భంలోని గుహలోకి పంపాడు. అలాదీన్ ఆ గుహనుంచి తెచ్చిన దీపాన్ని తన కివ్వనందున మాంత్రికుడు అలిగి, అతణ్ణి ఆ గుహలోనే వుంచి భూస్థాపన చేశాడు.]

ఈ మాంత్రికుడు వాస్తవంగా మొరాకో దేశస్థుడే. అతనికి అనేక రకాల మంత్ర తంత్రాలు తెలుసును. అతను చిన్నపిల్ల వాడుగా ఉన్నప్పుడే ఉచ్చాటనలూ, ప్రయోగాలూ, ఉపాసనలూ ప్రారంభించి, నలభై ఏళ్ళు వచ్చేసరికి సాటిలేని శక్తులు సంపాదించాడు. ఈ శక్తులతోబాటు అతనికి రహస్యజ్ఞానంకూడా లభించింది. అందుచేత అతను ఒక వింతవిషయం తెలుసుకున్నాడు.

ఎక్కడో దూరాన ఉన్న చీనాదేశంలో ఒక నగరం వున్నది. ఆ నగరం సమీపాన భూగర్భంలో ప్రపంచంలో ఎక్కడా లేనంత గొప్ప నిధి వున్నది. ఆ నిధితోబాటు ఒక అద్భుతదీపంకూడా ఉన్నది. ఆ దీపాన్ని సంపాదించినవాడు ఏది కావాలంటే అది సాధించవచ్చు; కాని అలాదీన్ అనే ఒక పేద కుర్రవాడికి మాత్రమే ఆ లాంతరును బయటికి తెచ్చే శక్తి వున్నది.

వి. ప్రసాదరావు

ఈ విషయాలన్నిటినీ మాంత్రికుడు మొరాకోలో వుండే గ్రహించాడు. తాను తెలుసుకున్న ఈ విషయాలను పూర్తిగా నమ్మి ఆ మాంత్రికుడు బయలుదేరి చీనాకు వచ్చాడు. ఈ ప్రయాణం అతనికి చాలా ప్రయాస కలిగించింది. కాని అతనికి అలాదీన్ దొరికాడు. అంతా సవ్యంగానే జరిగింది. కాని ఆఖరుక్షణంలో అలాదీన్ మాంత్రికుడికి దీపం అందించ నిరాకరించాడు. దానితో అతడికి కోపంవచ్చి అలాదీన్‌ను గుహలో బంధించి తాను మొరాకోకు వెళ్ళిపోయాడు.

తన నెత్తిపైన వున్న బిలం ఎప్పుడైతే మూసుకుపోయిందో అలాదీన్ కంగారుపడి కేకలుపెట్టసాగాడు. "చిన్నాయినా, నన్ను పైకి లాగు!" అని ఏడిచాడు. కాని అతని మొర ఆలకించేవారు లేరు. అయన తన చిన్నాయిన కాదని, తాను మోసపోయాననీ అలాదీన్ గ్రహించాడు. ఈ గుహలో తనకు చావు తప్పదని నిశ్చయించుకుని అతను మెట్లు దిగి తోటలోకి పోవటానికి ప్రయత్నించాడు. కాని మెట్లఅడుగున వున్న వాకిలి అప్పుడు మూసుకుని ఉన్నది. అందుచేత అతను మెట్లమీద చేరగిలబడ్డాడు.

అలాదీన్ మూడురోజులపాటు అక్కడే ఉన్నాడు. అతనికి ఈ మూడురోజులపాటూ తిండీ నీరూ లేవు. అంతసేపూ అతను



ఏడుస్తూ, మధ్యమధ్య అల్లాను ప్రార్థిస్తూ గడిపాడు. చచ్చిపోవటం తప్పదన్న నిరాశతో అతను చేతులు నలుపుకుంటూ ఏడవ సాగాడు. అలా చేతులు నలుపుకోవటంలో అతను తన వేలిన వున్న ఉంగరాన్ని రుద్దుకున్నాడు. ఆ ఉంగరం అలాదీన్‌కు మాంత్రికుడిచ్చినదే.

ఆ ఉంగరాన్ని అలాదీన్ రుద్దగానే ఒక నల్లటి, ఎత్తయిన భూతం అతనిఎదట ప్రత్యక్షమై, "ఏం సెలవు, దొరా?" అని అడిగింది.

అలాదీన్ గుండె అవిసిపోయింది. కాని మాంత్రికుడి ప్రభావం కళ్లారా చూసి ఉన్నాడు గనక, ధైర్యం తెచ్చుకుని, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"నేను ఉంగరాన్ని ఆశ్రయించిన భూతాన్ని. ఆ ఉంగరం ఎవరి చేతికి వుంటే వారికి బానిసగా ఉండి, చెప్పిన పని చేస్తాను," అన్నది భూతం.

"అయితే నన్ను ఇక్కడినుంచి తీసుకుపోయి భూమిమీద పెట్టు," అన్నాడు అలాదీన్.

మరుక్షణం భూమి పెళపెళా పగిలిన చప్పుడయింది. అలాదీన్ భూమిమీద ఉన్నాడు. మూడురోజులపాటు చీకటిలో ఉన్న కారణంచేత అతని కళ్లు సూర్య





కాంతిని భరించలేకపోయాయి. అతను దిన రకు కళ్లుతెరచి చూసేసరికి తాను భూమి మైన ఉన్నట్టు స్పష్టమయింది. గుహ జాడ గాని, చలవరాతిపలక జాడగాని లేదు. మాంత్రికుడు చితుకులతో మంట చేసినచోట బూడిదమాత్రం ఉన్నది. దూరాన తోటలూ, వాటిఅవతల నగరమూ కనిపించాయి. అలాదీన్ పెద్దనిట్టూర్పు విడిచి, అల్లాకు ధన్యవాదాలు చెప్పుకుని ఇంటికి బయలుదేరాడు.

తాను అంతదూరం ఎలా నడిచాడో అతనికే తెలియదు; ఇంటో అడుగు పెడుతూనే అతని తల్లిఎదట శోషతో పడిపోయాడు. అలాదీన్ తల్లి ఇన్నిరోజులూ అతనికోసం ఎదురుచూస్తూ కూచునివున్నది. అప్పుడామె అతని మొహాన చన్నీరు చల్లి, స్పృహ తెప్పించి, తినటానికింత తిండి పెట్టింది. అలాదీన్‌కు మళ్లీ కొంతబలం వచ్చింది. "చూడమ్మా, నా చిన్నాయిన అంటూ వచ్చినవాడు ఎవడో మాంత్రికుడు—నిజంగా చిన్నాయిన కాదు. వాడు చాలా క్రూరాత్ముడు, నన్ను చంపెయ్యటానికి ప్రయత్నం చేశాడు. వాడి మాటలు నమ్మి మనం మోసపోయాం! వాడేంచేశాడో తెలుసా, అమ్మా?" అంటూ అలాదీన్ జరిగినదంతా తల్లికి చెప్పాడు.

ఆమె తల అడ్డంగా తిప్పి, "వాడు దొంగవాడని నేను అప్పుడే అనుకున్నా రా, నాయనా. ఇంకా నయం, భగవంతుడి దయ వల్ల నువ్వు ప్రాణం దక్కి బయటపడ్డావు!" అన్నది. ఆమె ఈవిధంగా మాట్లాడుతూండగానే, మూడు రోజులు నిద్రాహారాలు లేని అలాదీన్, మైకంలో పడిపోతున్నవాడిలాగా అయిపోయి, మర్నాడు మధ్యాహ్నందాకా గాఢనిద్ర పోయాడు.

అతను తిరిగి లేస్తూనే, "అమ్మా, ఆకలిగా ఉంది, అన్నం పెట్టు!" అన్నాడు.

"అయ్యో, తండ్రీ! ఇంట్లో తినటానికేమీ లేదురా! ఉన్నదంతా నిన్న నీకే పెట్టాను. ఆకలికి కొంచెం ఓర్చుకుంటివా, నేను పది



తిన నూలున్నది. దాన్ని అమ్మి ఏకేదైనా తిన టానికి పట్టుకొస్తాను!" అన్నది తల్లి.

"నూలు అమ్మితే ఏం వస్తుందమ్మా? నేను తెచ్చిన దీపం పట్టుకురా. దాన్ని అమ్మేసి వచ్చినంత డబ్బు తెస్తాను!" అన్నాడు అలాదీన్.

అతని తల్లి దీపాన్ని తెచ్చి, "ఇది మురికిగా ఉంది, నాయనా. శుభ్రంగా తోమి తళతళ లాడేట్టు చేస్తే, రెండు డబ్బులు ఎక్కువ రావచ్చు," అన్నది.

ఆవిడ ఇంత తడిఇసక తెచ్చి దీపాన్ని తోమ నారంభించింది. ఆవిడ దీపాన్ని రెండు సార్లు రుద్దిందో లేదో, ఆమె ఎదట పెద్ద తాటి చెట్టంత భూతం నిలబడి, "ఏం సెలవు, దొరసాని? నేనూ ఇంకా ఇతర భూతాలు ఈ దీపంవెంట వుండి, ఈ దీపం ఎవరి చేతిలో ఉంటే వారికి సేవచేస్తాం!" అన్నది.

ఆ భూతాన్ని చూడగానే అలాదీన్ తల్లి కొయ్యబారి పోయింది. భయంతో ఆమె నోట ఏమాటా రాలేదు. మరుక్షణంలో ఆమె స్పృహ తప్పి పడిపోయింది.

ఇంటలో ఉన్న అలాదీన్‌కు భూతం మాటలు వినిపించాయి. ఉంగరం భూతంతో అతను అదివరకు మాట్లాడిఉన్న కారణం చేత అతను బయటికి పరిగెత్తుకు వచ్చి జరిగినది చూశాడు. తన తల్లి చేతిలోనుంచి దీపాన్ని లాక్కుని, "ఏయ్, నాకు ఆకలిగా ఉంది. తినడానికి మంచి భోజనం పట్టుకు రా!" అని భూతాన్ని ఆజ్ఞాపించాడు.

భూతం మాయమై అంతలోనే తిరిగి వచ్చి ఒక విశాలమైన వెండిపళ్లెం కింద ఉంచింది. దానినిండా రకరకాల ఆహారాలూ, పానీయాలూ ఉన్నాయి. భూతం తిరిగి అదృశ్యమైపోయాక అలాదీన్ తన తల్లికి శైత్యోపచారాలు చేసి మూర్ఛ తెలిసేట్టు చేశాడు.

ఆవిడ కళ్లుతెరచి వెండిపళ్లెంలో ఉన్న ఆహారాలు చూసి, "ఇవన్నీ ఎక్కడివిరా,

నాయనా? రాజుగారు మనం పడే బాధలు తెలుసుకుని భోజనం పంపించారా ఏమిటి?" అన్నది ఆశ్చర్యంగా.

"ఆ విషయాలన్నీ తరవాత తెలుసుకో వచ్చులే, ముందు ఆకలి తీర్చుకుందాం, అమ్మా!" అన్నాడు అలాడిన్.

పాపం, ఆ పేదరాలు అటువంటి భోజనం ఎన్నడూ చేసివుండలేదు. అది చక్రవర్తులు చేసే భోజనం. ఆ వెండిపళ్లెం విలువకూడా ఆ తల్లికొడుకు లెరగరు. ఎందుకంటే వారెన్నడూ వెండివస్తువులు కొన్నవారుకారు.

వారిద్దరూ కడుపునిండా తినగా ఇంకా రెండు పూటలకు సరిపడే భోజనపదార్థాలు మిగిలిపోయాయి. చివర కావిడ తన కొడుకుతో, "నాయనా, నువ్వు ఇక ఆకలిగా ఉంది అనవు. అదే నాకు పదివేలు. అన్నట్టు ఆ భూతం ఏమయిందిరా?" అన్నది.

తాను మూర్ఛపోయాక జరిగిన సంగతు లన్నీ ఆమె కొడుకునుంచి తెలుసుకుని, "అయితే మనుషులకు భూతాలు నిజంగా కనిపిస్తాయన్నమాట! నేనెన్నడూ ఒక్క భూతాన్నికూడా చూసి ఎరగను. నిన్ను ఆ గుహలోనుంచి బయటికి తెచ్చిన భూత మిదే కాబోలు!" అన్నది.

"కాదమ్మా, నన్ను గుహలోనుంచి బయటపడేసిన భూతం ఉంగరానిది. ఇది



దీపంభూతం. రెండిటి ఆకారంలోనూ చాలాతేడా ఉంది," అన్నాడు అలాదీన్.

"మన కొంపమీదికి ఈ భూతాలన్ని ఏమిటి, నాయనా? ఆ ఉంగరాన్నీ, దీపాన్నీ ఎక్కడన్నా పారేసిరా. నీకు పుణ్యం వుంటుంది!" అన్నది అలాదీన్ తల్లి ఎంతో భయంతో.

"అవి మనకు ఉపకారం చేస్తున్నాయి గదా?" అన్నాడు అలాదీన్.

"అసలు మనం ఆ భూతాలతో ప్రమేయం పెట్టుకోవటమే తప్పు. అదీ కాక, వాటిని చూసి నేను దడుచుకు చస్తాను. అవి మనకు వద్దు, నాయనా!" అన్నది తల్లి.

"అమ్మా, నువ్వు కొంచెం ఆలోచించు. మనకు మళ్లీ ఆకలి అవుతుంది. అప్పుడు ఏం తింటాం? ఆ మాంత్రికుడు మొరాకో నుంచి అంత దూరం ప్రయాసపడి వచ్చింది దేనికో తెలుసా? ఈ దీపంకోసం! ఆ గుహలో అంతులేని బంగారం వుంది; కాని వాడు దానికోసం అడగలేదు. నేను తనకు దీపం ఇచ్చాను కానని నన్ను గుహలో మూసిపెట్టి వెళ్ళిపోయాడు. ఈ దీపం అటువంటి ప్రభావం కలది. అది మనవద్ద ఉన్నంత కాలమూ మనకేలోటూ వుండదు. దాన్ని మనం ప్రాణంకన్న ఎక్కువగా కాపాడు కోవాలి. అది మనవద్ద ఉన్నట్టు పురుగు





కైనా తెలియనివ్వరాదు. ఇక ఈ ఉంగరం మాటా? అది నన్ను ఒకసారి చావునుంచి కాపాడింది. రేపు నాకింకో ఆపద రావచ్చు. అప్పుడు నన్నది కాపాడుతుంది. దాన్ని ఎలా పారెయ్యను? అది నాచేతిన వుండ వలసిందే. దీపాన్ని చూసి నువ్వు దడుచు కుంటావన్నట్టయితే దాన్ని నీకంట పడ కుండా ఎక్కడైనా దాస్తాలే!" అన్నాడు అలాదీన్.

"ఇక నీయిష్టం, నాయనా. నేనెందుకు కాదనాలి? కాని నేనుమాత్రం ఇక ఆ భూతాలను నా కళ్ళతో చూడను, వాటితోనే నాకక్కర్లేదు!" అన్నది తల్లి.

భూతం తెచ్చియిచ్చిన ఆహారం మర్నాటి కల్లా అయిపోయింది. పెద్ద వెండిపళ్ళెమూ, అందులో వుండిన పన్నెండు చిన్నకంచాలూ మిగిలాయి. అలాదీన్ ఒక చిన్న కంచం పట్టుకుని బజారుకు వెళ్ళి, దాన్ని ఒక వడ్డి వ్యాపారికి చూపాడు. వ్యాపారి అలాదీన్ కేసి చూసి, "దీన్ని ఎంతకు అమ్ముతావు?" అని అడిగాడు.

"దానిధర ఎంతో నీకు తెలియదా?" అన్నాడు అలాదీన్ గడుసుగా.

వడ్డివ్యాపారి తికమకలో పడ్డాడు. ఆ కంచం ఖరీదు అలాదీన్‌కు తెలుసునో, తెలియదో? తక్కువఇస్తే అలాదీన్ తిడతాడేమో, ఎక్కువఇస్తే తనకు అనవసరంగా నష్టం జరుగుతుందేమో? ఈ విధంగా ఆలోచిస్తూ ఆయన తన జేబులోనుంచి ఒక బంగారు నాణెం పైకితీశాడు. అలాదీన్ ఆశగా చెయ్యి చాచి, ఆ నాణెం తీసుకుని ఇంటికి పరిగెత్తాడు. ఆ కంచం విలువ అతనికి తెలియదనీ, ఇంకా తక్కువ ఇచ్చినా అతను తీసుకునే వాడేననీ గ్రహించి వడ్డివ్యాపారి చాలా చింతించాడు.

అలాదీన్ తాను తెచ్చిన బంగారునాణెం తల్లికిచ్చాడు. ఆమె బజారుకు వెళ్ళి కావలసిన వస్తువులు తెచ్చింది. ఆ డబ్బు



ఖర్చయిపోగానే అలాదీన్ ఇంకొక చిన్న కంచం పట్టుకుపోయి వర్తీవ్యాపారికి అమ్మాడు. లోగడ ఒక బంగారునాణెం ఇచ్చివున్నాడు గనక వ్యాపారి ఈసారికూడా అంతే ఇవ్వవలసివచ్చింది.

ఇలా పన్నెండు కంచాలూ అమ్మి ఆ డబ్బు ఖర్చుచేసినాక వెండిపళ్లెం మిగిలింది. అది చాలా బరువు. అందుచేత అలాదీన్ వర్తీవ్యాపారిని ఇంటికి పిలిపించాడు. ఆ వ్యాపారి అలాదీన్ చేతిలో పది బంగారు నాణాలు పెట్టి పళ్ళాన్ని పట్టుకెళ్ళాడు.

ఆ డబ్బుకూడా అయిపోయింది. అలాదీన్ తన తల్లిని ఎక్కడికో పంపేసి, దీపాన్ని బయటికి తీసి రుద్దాడు. భూతం ప్రత్యక్షమయింది. "ఆకలిగా వుంది. వెనక తెచ్చినట్టే భోజనం పట్టుకురా!" అన్నాడతను, భూతంతో. భూతం మరొకసారి పెద్ద వెండి పళ్ళెంలో పన్నెండు కంచాలనిండా ఆహారం పేర్చుకుని తెచ్చియిచ్చి, మాయమయింది.

కొంచెంసేపటికి అలాదీన్ తల్లి తిరిగి వచ్చింది. ఆహారం చూసి ఎంతో సంతోషించి, "ఆ భూతం కడుపు చల్లగా భోజనం వచ్చిందా? దాన్ని మాత్రం నా కళ్ళ చూడను!" అన్నది. ఆ తరవాత తల్లి కొడుకులు ఏ చింతా లేకుండా రెండురోజులపాటు సుఖంగా భోజనం చేశారు. తరవాత అలాదీన్ వెండికంచం ఒకటి పట్టుకుని బజారుకు బయలుదేరాడు.

దారిలో ఒక కమసాలి దుకాణం వున్నది. ఈ కమసాలి చాలా న్యాయస్థుడు, ధర్మబుద్ధి కలవాడు. ఆయన అలాదీన్‌ను చూసి, "నేను అప్పుడప్పుడూ చూస్తున్నాను, ఏమిటో పట్టుకుపోయి వర్తీవ్యాపారికి అమ్ముతున్నట్టున్నావే? వాళ్ళు కర్కోటకులు, నాయనా? నాకు అమ్మరాదా? నేను నిన్ను మోసం చేస్తానా?" అన్నాడు.

అలాదీన్ చంకలోనుంచి కంచంతీసి కమసాలికి చూపాడు. కమసాలి దాన్ని



త్రాసులో తూచి, "దీని ఖరీదు చెప్పు బంగారు నాణాలు. నీకా వర్తకవ్యాపారి లోగడ ఏమిచ్చాడు ?" అన్నాడు.

"ఒక్క నాణెం ఇచ్చాడు దుర్మార్గుడు!" అని చెప్పి, అలాదీన్ ఆ కంచాన్ని కమసాలికి అమ్మి అతడు యిచ్చిన డబ్బు పుచ్చుకుని ఇంటికి వెళ్ళాడు.

అది మొదలు అలాదీన్ తన వెండి యావత్తూ కమసాలికే అమ్ముతూ వచ్చాడు. క్రమంగా అతనివగ్గిర ధనం చేరసాగింది. కాని అలాదీన్ ఆర్భాటంగా జీవించాలని ప్రయత్నించలేదు. అవసరమైన వస్తువులు మాత్రమే కొంటూ, డబ్బు ఏమాత్రమూ వృధా చెయ్యకుండా, అతనూ అతని తల్లికూడా నిరాడంబర జీవితం గడపసాగారు.

ఇప్పుడు అలాదీన్ పూర్తిగా మారిపోయాడు. అతనిలో సోమరిలక్షణా లేమీ లేవు. అతను రోజూ బజారుకు వెళ్ళి పెద్ద పెద్ద వ్యాపారస్తులతో మాట్లాడేవాడు; క్రయవిక్రయాలు గమనించేవాడు; రత్నవర్తకులు చేసే అమ్మకాలు పరిశీలించేవాడు.

అతనికి ఒక అద్భుతమైన విషయం తెలియవచ్చింది; మాంత్రికుడు తనను గుహలోకి పంపినప్పుడు, అక్కడి తోటనుంచి తాను కోసుకువచ్చిన పళ్లు రంగు గాజు పెంకులు కావు—వెలలేని రత్నాలు! తన వద్ద వున్న రత్నాలు చక్రవర్తులవద్దకూడా వుండవు! రత్నవర్తకులవద్ద వున్న మణులలోకల్లా విలువైనవాటిని అలాదీన్ చూశాడు. కాని అవేవీ అతనివద్ద ఉన్నవాటికి ఏమాత్రమూ చాలవు.

అతను ఈ సంగతి గ్రహించిన కొద్ది రోజులకే ఒక చిత్రం జరిగింది. ఆ ఉదయం అతను నగలవర్తకుల బజారుకు పోతూండగా రాజభటులు వచ్చి దుకాణాలన్నీ మూయించసాగారు. ఆ దారిగా రాజకుమార్తె స్నానశాలకు వెళుతున్నది. వీధులలో దుకాణాలన్నీ మూసి, జనం ఇళ్లలోకి

వెళ్ళిపోయి, వీధులు ఖాళీ చెయ్యవలసిందని, అలా చెయ్యనివారికి మరణదండన విధించ బడుతుందని రాజభటులు హెచ్చరికలు చేస్తూవచ్చారు.

ఈ హెచ్చరిక వినగానే అలాదీన్‌కు ఎలాగైనా రాజకుమార్తెను చూడాలన్న కుతూహలం కలిగింది. రాజకుమార్తె బుదూర్ చాలా గొప్ప అందగత్తె అని అందరూ అనుకోవటం అతను విని వున్నాడు.

ఆమెను చూడటానికి వీలుగా దాక్కోవాలని అతను చుట్టూ కలయజూశాడు. అతనికి అలాటి చోటేదీ కనిపించలేదు. స్నానశాల తలుపుల వెనక దాక్కుంటే బుదూర్ అక్కడికి చేరేటప్పుడు చూడటానికి సాధ్యపడుతుందని అతనికి తోచింది. వెంటనే అలాదీన్ స్నానశాలకేసి పరిగెత్తాడు. స్నానశాలద్వారం చాలా పెద్దది. దాని తలుపుల వెనక దాక్కుని అలాదీన్ రాజకుమార్తె రాకకోసం ఎదురుచూడసాగాడు.

ఈలోపుగా రాజకుమార్తె బుదూర్ రాజభవనంనుంచి బయలుదేరి, నగరం చూస్తుంటూ, నిర్మానుష్యంగా వున్న వీధుల వెంబడి స్నానశాలకు వచ్చింది. స్నానశాలలోకి అడుగుపెట్టబోతూ ఆమె తన ముఖానికి అడ్డంగా వున్న మేలిముసుగు పైకెత్తింది.

అప్పుడు అలాదీన్ రాజకుమార్తెను చూశాడు. ఆమె ముఖం చంద్రబింబం కన్నకూడా అందంగా వున్నట్టు అతనికి తోచింది. "ఆహా, ఇటువంటి సౌందర్యాన్ని సృష్టించిన అల్లా మహిమ!" అనుకున్నాడు అలాదీన్.

ఆ క్షణంవరకూ అలాదీన్‌కు అందరు ఆడవాళ్లూ తన తల్లిలాగే కనబడేవారు. వారిలో ప్రత్యేకమైన అందం ఉంటుందని అతని కెన్నడూ తోచలేదు. కాని రాజకుమార్తె బుదూర్‌ను చూసిన క్షణం అతని హృదయం ప్రేమతో నిండిపోయింది.

(ఇంకా ఉంది)






# 4

[మొరాకో మాంత్రికుడు అలాదీనును భూగర్భంలో పెట్టి వెళ్ళిపోయాక అతను తన వేలి నున్న ఉంగరంలో ఉన్న భూతం సహాయంతో పైకి వచ్చి ఇల్లు చేరుకున్నాడు. తరవాత లాంతరులో ఉన్న భూతం అతనికి పెద్దపెద్ద వెండికంచాలలో మహారాజులు తినే భోజనం తెచ్చి పెట్టసాగింది. ఆ వెండి అమ్ముకుని అలాదీన్ ధనికుడు కాసాగాడు. గుహలో నుంచి తాను తెచ్చిన రత్నాలు అపారమైన విలువగలవనికూడా అతనికి అర్థమయింది. ఇంతలో ఒకనాడతను రాజకుమార్తె బదూర్‌ను చూసి ఆమెను ప్రేమించాడు.]

అలాదీన్ ఇంటికి చేరేసరికి అతను ఈ ప్రపంచంలో ఉన్నట్టు లేడు. అతని వాలకం చూసి తల్లి అదుర్దాగా, "అలా వున్నావేంరా, నాయనా? ఒంట్లో బాగాలేదా?" అని అడిగింది.

అలాదీన్ తల్లికి జవాబు చెప్పలేదు. తల్లి తీసుకువచ్చి తన ఎదట పెట్టిన భోజనం అతను ముట్టనేలేదు.

"అయ్యో, తండ్రీ! నీకేం జబ్బు చేసిందిరా? బాధ ఏమైనా వుందా? నాతో మాటమాత్రం చెప్పరా!" అని తల్లి ఎంతగానో బతిమాలింది.

"నన్ను వేధించకమ్మా!" అన్నాడు అలాదీన్ విసుగుగా.

అతను అన్నం తిన్నదాకా తల్లి వదిలి పెట్టలేదు. అందుకని అతను కొంచెంగా

వి. ప్రసాదరావు



ఎంగిలిపడ్డాడు. ఆ తరవాత అతను పక్క మీద పడుకుని ఆ రాత్రల్లా ఏమేమిటో ఆలోచించాడు. మర్నాడల్లా అతను పక్కమీది నుంచి లేవలేదు.

కొడుకు ప్రవర్తన తల్లికి విచిత్రంగా కనిపించింది. ఆవిడ అతన్ని ప్రశ్నలతో వేధించింది, వైద్యుణ్ణి పిలుస్తానన్నది. కొత్తగా ఒక అరబ్బీ వైద్యుడు నగరానికి వచ్చాడు. రాజుగారుకూడా ఆయనచేత వైద్యం చేయించుకుంటున్నారు. కావలిస్తే ఆ వైద్యుణ్ణి పిలుచుకువస్తానన్నది ఆమె.

"అమ్మా, నేను బాగానే ఉన్నాను. నాకే రోగమూ లేదు. ఇదివరకల్లా ఆడవాళ్ళందరూ ఇలాగే ఉంటారనుకునే వాణ్ణి. కాని నిన్న రాజకుమార్తె బుదూర్‌ను స్నానశాలవద్ద చూశాను. స్నానశాలవద్ద ఆమె తన ముఖం మీది మేలిముసుగు తొలగించింది, అప్పుడు నా కామె ముఖం కనబడింది. వెంటనే నాకు నవనాడులు నీరసించినట్టయి పోయింది. ఎలాగైనా రాజుగారిని ఒప్పించి ఆమెను పెళ్ళాడితే తప్ప నా మనస్సుకు శాంతి ఉండదు!" అన్నాడు అలాదీన్.

ఈ మాటలు వినగానే అలాదీన్ తల్లి నిశ్చయంగా తన కొడుక్కు పిచ్చి పట్టిందనుకున్నది.

"అవేం మాటలురా? నీకేమైనా మతి పోయిందా ఏమిటి? ఇక ఎన్నడూ అలాటి మాట అనకు!" అని ఆమె తన కొడుకును మందలించింది.

"నాకేమీ పిచ్చిలేదు. నువు లక్ష చెప్పు గాక, నా మనసు మారటం కల్ల! నేను రాజకుమార్తెను పెళ్ళాడి తీరవలిసిందే. రాజుగారివద్దకు వెళ్ళి, మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చేస్తారా, చెయ్యరా అని ఖచ్చితంగా అడిగేస్తాను. ఏమైనాసరే వెనకాడేది లేదు!" అన్నాడు అలాదీన్.

"మళ్ళీ అదే మాటా? చుట్టుపక్కాల వాళ్ళు వినిపోగలరు, ఊరుకోరా, బాబూ!



రాజుగారిని ఇటువంటి మాట అడగటానికి మధ్యవర్తులైనా ఉండాలా? నీకెవరు మధ్యవర్తిత్వం చేస్తార్రా?" అన్నది తల్లి.

"నువ్వున్నావుగా, అమ్మా? నీకన్న నాకెవరున్నారూ? అందుచేత నువ్వు వెళ్ళి నా మనసులో ఉన్న కోరికను రాజుగారికి తెలియజెయ్యి!" అన్నాడు అలాదీన్.

"ఇంకా నయం! నేనా? నీతోపాటు నాకుకూడా మతిపోయిందనుకున్నావా ఏం? మీ నాన్నేమో కూటికి లేని దర్జీవాడు. రాజుగారి కూతుర్ని పెళ్ళాడతాననటానికి నీకసలు హక్కెక్కడుంది? వారా అమ్మాయిని ఏ రాజాధిరాజు కొడుకుకో ఇచ్చి చేస్తారు. కయ్యానికీ వియ్యానికీ సమాన హోదా ఉండాలి, నాయనా!" అన్నది తల్లి.

"అదంతా నాకు తెలియదా, అమ్మా? ఏమైనా నేనీ పెళ్ళి చేసుకోవటానికి పూర్తిగా నిశ్చయించుకున్నాను. ఈ నిశ్చయం మారబోదు. నేను కోరుకునన్న ఆపేక్ష నీకున్నట్టయితే నాకీ మాత్ర సహాయమూ చెయ్యి. ఎందుకంటే ఈ కోరిక తీరని పక్షంలో నేను ఆట్టేకాలం బతకను. నీకా నేనొక్కణ్ణే కొడుకును!" అన్నాడు అలాదీన్.

అలాదీన్ తల్లి కంట తడి పెట్టుకుంటూ, "అవును, నాయనా! నేను నీ తల్లిని, నువ్వొక్కడివే నా కొడుకువు. నీకు పెళ్ళి అయి సుఖంగా ఉండటంకన్న నాకే కోరికా లేదు. అందుచేత మన సమానస్తుల పిల్ల ఎక్కడైనా ఉంటే పెళ్ళిమాటలు జరుపుతాను. అప్పుడుకూడా పిల్లతరుపు వాళ్ళు, నీ కొడుకేం చేస్తుంటాడని అడిగితే ఏం చెప్పాలో నాకు తెలీదు. మనలాటివాళ్ళకే సమాధానం చెప్పలేని స్థితిలో ఉండి రాజుగారి కూతుర్ని ఎలా అడిగేది, నాయనా? కొంచెం ఆలోచించు, అలాటి కోరిక బయట పెట్టినాక మనల్ని బతకనిస్తారా? అసలు అడగటానికి నాకుమాత్రం ఎలా మొహం చెల్లుతుంది. మొదలు నేను రాజుగారి

ఎదటికి వెళ్ళటం ఎల్లా? వెళ్ళానే అనుకో ఆయన కేదైనా కానుక ఇవ్వాలిగద! ఏం ఇవ్వను? పోనీ మహారాజుగారికి నువ్వేదైనా మహోపకారం చేశావు గనకనా?" అన్నది.

"నువ్వు చెప్పేది నిజమేనమ్మా. నేను మహారాజుకు ఏమి మహోపకారం చేశానని అడుగుతున్నావు. నే నాయనకు అపూర్వమైన వస్తువు బహుమానం ఇవ్వగలను. నేను గుహలో వున్న తోటనుంచి తెచ్చిన రాళ్ళు అమూల్యమైన రత్నాలు. అటువంటి రత్నాలలో ఒక్కటికూడా ఏ రాజువద్దా వుండదు. ఒక పళ్ళెం పట్టుకురా, వాటిని చూపిస్తాను!" అన్నాడు అలాదీన్.

అతని తల్లి ఒక పింగాణీ పళ్ళెం తెచ్చింది. అతను దానిలో కొన్ని రత్నాలు పేర్చాడు. వాటి కాంతి చూసి అతని తల్లి నిర్ఘాంతపోయింది. "వీటిని తీసుకుపోయి మహారాజుకు కానుకగా ఇచ్చి ఆయన దర్శనం చెయ్యి," అన్నాడు అలాదీన్.

"సరే, నాయనా! ఇది చాలా గొప్ప బహుమానమే. కాని ఆ మహారాజు ఏం కావాలంటే, నా నోటమాట వస్తుందో రాదో! మీ అమ్మాయిని మా అబ్బాయి కివ్వమంటే నన్ను తిట్టి గెంటేస్తారేమో! మనిద్దరికీ మరణదండన విధిస్తారేమో! అయినా నీ కోసం ఏం చెయ్యమన్నా చేస్తాను. కాని,



నీ హోదా ఏమిటి, నీకున్న ఆస్తి ఏమిటంటే ఏమని చెప్పేదిరా ?" అన్నది తల్లి.

ఈ బహుమానం తీసుకున్నాక ఆయన అటువంటి ప్రశ్న వెయ్యడమ్మా! ఒకవేళ వేస్తే నీ యిష్టం వచ్చిన సమాధానం చెప్పు. అది నిజం చేసేటందుకు మనదగ్గిర అద్భుత దీపం వున్నది!" అన్నాడు అలాదీన్.

మర్నాడు అలాదీన్ తల్లి, అద్భుతదీపం మీద భారమంతా వేసి, ధైర్యంగా రాజుగారి దర్శనానికి సిద్ధమయింది. ఆవిడ పళ్ళెంలోని రత్నాలపైన ఒక శాలువా కప్పి, పెందలాడే రాజుగారి ఇంటికి వెళ్ళింది. రాజదర్శనం కోసం వచ్చేవారింకా గుంపు కూడలేదు. మంత్రులూ, ఇతర అధికారులూ సభా భవనంలోకి పోవటం ఆమెకు కనిపించింది. చివరకు రాజుగారు వచ్చారు. సభలో అందరూ లేచి నిలబడ్డారు. రాజుగారు సింహాసనంపై కూర్చున్నాక సభికులు ఎవరి హోదాకు తగ్గ స్థానాలలో వారు కూర్చున్నారు.

ముందుగా న్యాయవిచారణలు జరిగాయి. కాని రాజుగారి దర్శనం కోసం వచ్చినవారిలో చాలామందిని వ్యవధి చాలక వెళ్ళిపొమ్మన్నారు. అలాదీన్ తల్లికికూడా ఇదే గతి పట్టింది. అందరికన్న ముందే వచ్చినప్పటికీ, ఆమెకు రాజుగారి దర్శనం





చేయించటానికి ముందుకు వచ్చినవారు లేకపోయారు. ఆవిడ వచ్చిన దారినే ఇంటికి తిరిగి వచ్చింది.

ఆమె చేతిలో పళ్ళెం చూడగానే ఆమె వెళ్ళిన పని కాలేదని అలాదీన్ గ్రహించాడు. ఆవిడ లోపలికి వచ్చి, "ఎలాగైతేనేం రాజ సభలో ఇవాళ అడుగుపెట్టాను, నాయనా! రాజుగారితో నేను మాట్లాడలేదు నిజమే, కాని ఇంకా చాలామంది నాలాగే మాట్లాడలేదు. దేవుడు అనుగ్రహిస్తే రేపు మాట్లాడతాను," అన్నదావిడ.

అలాదీన్‌కు మొదట నిరాశ కలిగినా తల్లి మాటలతో ధైర్యమూ, ఓర్పూ వచ్చాయి.

అలాదీన్ తల్లి మర్నాడు వెళ్ళింది గాని సభాభవనం మూసివుంది. సభ రోజువిడిచి రోజు జరుగుతుందట. ఆవిడ సభకు వెళ్ళటం మానలేదు. వారం రోజులు గడిచాక రాజుగారు ఆమెను గమనించి, తన మంత్రితో, "ఆ మనిషిని ప్రతిసారీ చూస్తున్నాను. గులవ కప్పి ఏదో పట్టుకొచ్చి అలా నిలబడుతోంది. ఆమె పని ఏమిటో ?" అన్నాడు.

"మహాప్రభూ, స్త్రీలది అల్పబుద్ధి. భర్త మీదనో, బంధువులమీదనో ఫిర్యాదు చేయడానికి వచ్చిఉంటుంది!" అన్నాడు మంత్రి.

"ఈసారి ఆమె వచ్చినప్పుడు నా ఎదటికి పంపించు," అన్నాడు రాజు.

మరునాడు రాజు ఆమెను తన ఎదటికి పిలిపించి, "ఏమమ్మా, నిన్ను చాలా రోజులుగా చూస్తున్నాను. నువ్వు ఎన్నడూ నా ఎదటికి వచ్చి ఏమీ చెప్పుకోలేదు. నావల్ల నీకే సహాయం కావాలి ?" అని అడిగాడు.

అలాదీన్ తల్లి రాజుగారికి వంగి నమస్కారాలు చేసి, "మహాప్రభూ, నా మాటలలో అపచారం ఏమన్నా ఉంటే దండించనని అభయం ఇవ్వండి!" అన్నది.

రాజుగారు నవ్వి, "నీకేమీ భయంలేదు. సభ ముగిసేదాకా ఆగు, తరవాత నీకోరిక వింటాను," అన్నాడు.

సభ ముగిసింది. రాజూ మంత్రి తప్ప మిగిలిన సభికులందరూ వెళ్లిపోయారు. రాజుగారు అలాదీన్ తల్లితో, "నీ కోరిక ఏమిటి?" అన్నారు.

"మహారాజా, అలాదీన్ అని నాకొక కొడుకున్నాడు. వాడొకనాడు రాజకుమార్తెను స్నానశాల తలుపుల వెనకనుంచి చూశాడు. అదిమొదలు వాడా పిల్లను ప్రేమించాడు. ఆమెను పెళ్లాడకపోతే చచ్చిపోతానంటున్నాడు. అందులో తప్పుంటే మన్నించాలి!" అన్నది అలాదీన్ తల్లి.

రాజు నవ్వి, "ఆ కాలువకింద ఏమిటి?" అన్నాడు. అలాదీన్ తల్లి కాలువ తీసి, పళ్ళెంలో వున్న రత్నాలను రాజుగారికి అందించింది. వాటిని చూసి రాజుగారికి నోట మాట రాలేదు.

చివరకాయన, "నా జన్మలో నే నెన్నడూ ఇలాటి రత్నాలు చూసివుండలేదు. మంత్రి, నువ్వెప్పుడైనా చూశావా?" అన్నాడు.

"లేదు, మహాప్రభూ!" అన్నాడు మంత్రి.

"ఇలాటి రత్నాలు పంపినవాడు నా కుమార్తెను పెళ్ళాడటానికి అర్హుడు కాడూ?" అన్నాడు రాజు.

ఈ మాటకు ఏం జవాబు చెప్పాలో తెలియక మంత్రి తికమకపడ్డాడు. రాజకుమార్తె



బదూర్‌ను తన కొడుకుకిచ్చి చేస్తానని రాజుగారు లోగడ అనివున్నారు.

"మహారాజా, తమరు ఇంతకు పూర్వం రాజకుమార్తెను నా కొడుకుకిచ్చి పెళ్ళి చేస్తానని వాగ్దానం చేసివున్నారు. తమరు మా అబ్బాయికి మూడునెలలు గడువిచ్చే పక్షంలో వాడు ఇంతకంటె విలవైన కట్నం తెస్తాడు!" అన్నాడు మంత్రి.

మూడునెలలు కాదు, ముప్పై ఏళ్ళు గడువిచ్చినా ఇంతకంటె విలవగల కట్నం తీసుకురావటం మంత్రి కొడుకువల్ల కాదని రాజుకు పూర్తిగా తెలిసికూడా, మంత్రి కోరికను మన్నించి సరేనన్నాడు.

తరవాత రాజుగారు అలాదీన్ తల్లికేసి తిరిగి, "నా కుమార్తెను ఇచ్చి పెళ్ళి చేస్తానని మీ అబ్బాయితో చెప్పు. కాని మూడునెలల దాకా పెళ్ళి జరగదని చెప్పు. ఎందుకంటే పెళ్ళి ప్రయత్నాలకు ఆ మాత్రం వ్యవధి కావాలి," అన్నాడు.

అలాదీన్ తల్లి రాజుగారిని దీవించి శలవు పుచ్చుకుని ఇంటికి వచ్చేసింది. ఆమె మొహాన చిరునవ్వు చూడగానే అలాదీన్‌కు ఆశ రేకెత్తింది.

"నాయనా, రాజుగారు నీకు పిల్లనివ్వటానికి ఒప్పుకున్నారు. అయితే మంత్రిగారు ఆయన చెవిలో ఏదో గొణిగాడు. దానిమీదట రాజుగారు మూడునెలలదాకా పెళ్ళి వాయిదా కావాలన్నారు. మంత్రి ఏదో కుట్ర చేసి పెళ్ళి తప్పగొడతాడని నాకు అనుమానంగా ఉందిరా!" అన్నది.

అలాదీన్ పరమానంద భరితుడైనాడు. మూడునెలల వ్యవధి అతనిని అంతగా బాధించలేదు. "చచ్చిపోతున్నవాడికి ప్రాణం పోశావమ్మా!" అంటూ అతను తన తల్లిని అభినందించాడు.

రోజులు లెక్కపెడుతూ అలాదీన్ రెండు నెలలు గడిపాడు. ఆ తరవాత ఒకరోజు సాయంకాలం అతని తల్లి నూనెకోసం బజారుకు వెళ్ళింది. ఆవిడకు వీధులు చూడగానే ఆశ్చర్యం కలిగింది. దుకాణాలన్నీ మూసేశారు. వీధులనిండా తోరణాలూ, అలంకారాలూ, దీపాలూ కనిపించాయి. "ఈ అర్భాటమంతా ఏమిటి?" అని ఆవిడ నూనెకొట్టువాణ్ణి అడిగింది.

"నీకింకా తెలీదా? ఈ రాత్రికి మంత్రి కుమారుడు రాజకుమార్తెను పెళ్ళాడుతున్నాడు." అన్నాడు నూనె అమ్మేవాడు.

ఈ మాట వినగానే అలాదీన్ తల్లికి మతిపోయినట్టయింది. ఈ దుర్వార్త తన కొడుకు చెవిని వేయుట ఎలాగా అనుకుంటూ ఆవిడ ఇంటికి తిరిగి వచ్చింది. —(ఇంకావుంది)



# అద్భుతదీపం

## 5

[అలాదీన్ రాజకుమార్తె బుదూర్‌ను చూసి ప్రేమించాడు. అతని తల్లి అతనితరఫున రాజుగారి దర్శనం చేసుకుని, అలాదీన్ గుహలోనుంచి తెచ్చిన అమూల్యమైన రత్నాలు కానుకపెట్టి, రాజకుమార్తెను తన కొడుకుకిచ్చి చేయమని విజ్ఞాపన చేసుకున్నది. రత్నాలు చూసి దిగ్భ్రమ చెందిన రాజు పెళ్ళికి ఒప్పుకున్నాడు. మంత్రి అడ్డపడి పెళ్ళిని మూడు నెలలు వాయిదా వేయించాడు. రెండునెలలు గడిచాయి. ఒకనాడు అలాదీన్ తల్లి నూనెకోసం దుకాణానికి వెళ్ళి నగరమంతటా అలంకరణలూ, ఉత్సవాలూ చూసి, ఆ రోజే రాజకుమార్తెకూ మంత్రికుమారుడికీ పెళ్ళి జరగనున్నట్టు తెలుసుకున్నది.]

ఆమె ఇంటికి తిరిగి వస్తూనే అలాదీన్‌తో, "నాయనా, అశుభవార్త తెచ్చానురా! అది వింటె నువ్వెంత బాధ పడతావో!" అన్నది.

"ఏమిటమ్మా ఆ వార్త?" అన్నాడు అలాదీన్ ఆత్రంగా.

"ఏం చెప్పేది, నాయనా? రాజుగారు నీకిచ్చిన మాట తప్పి, తన కూతురిని మంత్రి కొడుకుకిచ్చి చేస్తున్నారు. ఈ రాత్రే లగ్నం. రాజుగారు సరే నన్నప్పటికీ మంత్రి ఏదో కుతంత్రం చేస్తాడని నేను భయపడుతూనే వచ్చాను సుమా!" అన్నది తల్లి.

"ఇంతకూ ఈ పెళ్లి సంగతి నీకెలా తెలిసిందమ్మా?" అని అలాదీన్ తల్లిని అడిగాడు.

వి. ప్రసాదరావు



ఆమె నగరంలో తాను చూసినవీ, తెలుసుకొన్నవీ అతనికి చెప్పేసింది. అలాదీన్ ఒక్క క్షణం పాటు నివ్వెర పోయాడు, కాని మరు క్షణం అతనికి తనవద్ద ఉన్న అద్భుత దీపం జ్ఞాపకం వచ్చింది.

"ఎందుకు విచారిస్తావమ్మా? ఈ రాత్రికి ఈ పెళ్లి జరిగే మాట అబద్ధం. నువు లేచి వంట చెయ్యి. భోజనం చేశాక నేనా పెళ్లి భగ్నం చేసే పని చూసుకుంటాను," అన్నాడు అలాదీన్ తల్లితో.

భోజనం చేసి అతడు తన గదిలోకి వెళ్లి, దీపం పైకి తీసి దాన్ని రుద్దాడు. వెంటనే భూతం ప్రత్యక్షమై, "ఏం సెలవు?" అన్నది.

"విను. రాజుగారు తన కూతుర్ని నాకిచ్చి పెళ్లి చేస్తానని మాట ఇచ్చాడు. అందుకు మూడు నెలలు గడువు కోరాడు. ఇంకా ఆ గడువు తీరకమునుపే తన కూతురిని మంత్రికొడుకు కిచ్చి ఈ రాత్రే పెళ్లి చేస్తున్నారు. అందుచేత నీవు ఈ రాత్రి పెళ్లి కూతుర్నీ పెళ్లికొడుకునూ వాళ్ల గది నుంచి ఎత్తుకునివచ్చి నా ఎదుట పెట్టు," అని అలాదీన్ దీపంభూతాన్ని ఆజ్ఞాపించాడు.

కొద్ది సేపటిలోనే భూతం పెళ్లికొడుకునూ, పెళ్లికూతుర్నీ తెచ్చి అలాదీన్ ముందు పెట్టి, "ఇంకేం సెలవు?" అన్నది.



అలాదీన్ మంత్రికొడుకును చూపిస్తూ, "ఈ నిర్భాగ్యుణ్ణి పెంట పోగుపైన పడుకో బెట్టి నిద్ర పుచ్చు. మళ్లీ రేపు తెల్లవారు జామున కనబడు," అన్నాడు.

భూతమూ, మంత్రికొడుకూ మాయమైన అనంతరం, అలాదీన్ రాజకుమార్తె కేసి తిరిగి, "నేను నీకు ద్రోహం చేసే బుద్ధితో ఇక్కడికి తెప్పించలేదు. మీ తండ్రే నాకు ద్రోహం తలపెట్టాడు. నిన్ను నాకిచ్చి పెళ్లి చేస్తానని మాట ఇచ్చి, అందుకు గాను మూడు మాసాలు గడు వడిగి, ఆ గడువు దాటకముందే ఆయన మాట తప్పి, నిన్ను ఈ మంత్రి కొడుకు కిచ్చి పెళ్లి చేయ సిద్ధ

పడ్డాడు! అందుచేత నేను తప్పనిసరి అయి ఇలా చేశాను," అన్నాడు.

పెళ్లి కోసం అలంకరించిన రాజభవనపు పడక గదిలో ఉన్న రాజకుమార్తె ఒక్క సారిగా ఒక పూరి ఇంట్లోకి మారిపోవటంచేత బెదిరిపోయింది. ఆమె ఆరాత్రల్లా కన్ను మూయలేదు. ఆమెను తన పక్కమీద పడుకోమని తనకూ ఆమెకూ మధ్య ఒక కత్తి అడ్డంపెట్టి అలాదీన్ సుఖంగానిద్రపోయాడు.

తెల్లారుజామున దీపంభూతం ఎవరూ పిలవకుండానేవచ్చేసింది. రాజకుమార్తెనూ, మంత్రికుమారుణ్ణీ రాజభవనానికి చేర్చమని అలాదీన్ భూతాన్ని ఆజ్ఞాపించాడు.

మరుక్షణం రాజకుమార్తే, మంత్రి కుమారుడూ రాజభవనంలో ఉన్నారు. తమను ఎవరు తెచ్చి చేర్చారో కూడా తెలుసుకునే అవకాశం వారికి లేకపోయింది.

రాజుగారు తన కుమార్తెను పిలిచి, "ఏమమ్మా, నీకూ నీ భర్తకూ అనుకూల దాంపత్యం కుదిరిందా ?" అని అడిగాడు. రాజకుమార్తె తండ్రికేసి చిత్రరపోయి చూసిందే గాని ఏమీ సమాధానం ఇవ్వలేదు. ఆయన ఆ ప్రశ్నే రెండుమూడుసార్లు అడి గాడు, కాని ఆమె సమాధానం చెప్పలేదు.

రాజు ఆగ్రహంతో రాణీవద్దకు వెళ్లి, "నీ భర్త నీకు అనుకూలంగా ఉన్నాడా అంటే



అమ్మాయి సమాధాన మివ్వదేమిటి ?" అని కోపంగా అడిగాడు.

"మీతో చెప్పటానికి సిగ్గుపడుతున్నది లెండి. నేనడిగి తెలుసుకుంటానుగా !" అన్నది రాణి.

కాని తల్లి ప్రశ్నలకుకూడా రాజకుమార్తె మొదట్లో సమాధానాలివ్వలేదు.

రాణి గాభరాపడి, "ఏం జరిగింది, తల్లీ? ఎందుకు జవాబు చెప్పవు ?" అన్నది.

దానికి రాజకూతురు, "ఏం చెప్పే దమ్మా ? నేనూ నా భర్తా గదిలోకి అడుగు పెట్టిన మరుక్షణం ఎవరో మమ్మల్ని ఒక దిక్కుమాలిన ఇంట్లో చేర్చారు. ఆ మనిషి ఎవరో చూసే అవకాశంకూడా లేకపోయింది. తరవాత నన్ను ఒంటరిగా విడిచి, నా భర్తను ఎక్కడికో తీసుకుపోయారు. నా పక్కన ఎవరో యువకుడు పడుకున్నాడు. మా ఇద్దరికీ మధ్య ఒక కత్తి ఉంచాడు. నేను హడిలి చచ్చాను. మళ్ళీ తెల్లారే సమయానికి ఇక్కడ ఉన్నాం. అందుచేతనే నాన్న నన్ను అడిగితే ఏం చెప్పాలో నాకు తెలియలేదు," అన్నది.

"నాతో చెబితే చెప్పావు గాని ఈ సంగతి ఇంకెవరికన్నా చెప్పావంటే నీకు నిశ్చయంగా మతి పోయిందనుకుంటారు. మీ నాన్నతో నువేమీ అనకపోవటం ఒక విధంగా మేలే





అయింది. ఆయన ఇంకొకసారి అడిగినా ఏమీ చెప్పదు," అన్నది రాణి.

"నా మాటలు నువు నమ్మలేదులాగుంది. నాకు మతి పోలేదమ్మా. నా మాటలు నమ్మకపోతే పోనీ నా భర్తనడుగు," అన్నది రాజు కూతురు.

"ఏదో భ్రమ పడ్డావులే, తల్లీ. అదంతా మరిచిపో. నీ పెళ్లికని ఎన్ని వినోదాలు చేస్తున్నారో చూతువు గాని, సిద్ధంకా!" అంటూ రాణి దాసీలను పిలిచింది. వారు రాజకుమార్తెను అలంకరించసాగారు.

ఈలోపల రాణి రాజువద్దకు వెళ్లి, "అమ్మాయికి రాత్రి ఏదో పీడకలలు వచ్చినట్టున్నవి. అంతకన్న మరేమీ లేదు. మీరు నిష్కారణంగా దానిపై ఆగ్రహించకండి!" అని చెప్పింది.

తరవాత ఆమె మంత్రికుమారుణ్ణి రహస్యంగా పిలిపించి, తన కుమార్తె చెప్పిన విషయాలన్నీ చెప్పి, "నిజంగా ఇలాగే జరిగిందా?" అని అడిగింది.

నిజం ఒప్పుకుంటే తనను చూసి అందరూ నవ్వుతారని మంత్రికొడుకు అన్నీ వట్టిదే నన్నాడు. తన కూతురికి పీడకలలో లేక భ్రాంతో కలిగివుంటుందని రాణి రూఢి చేసుకున్నది. రోజల్లా పెళ్లి సంబరాలు సాగాయి. పాడేవాళ్ళు పాడారు, ఆడేవాళ్లు ఆడారు. కాని రాజకుమార్తెలో కొంచెంకూడా ఉత్సాహం లేదు. గడచిన రాత్రి జరిగిన అనుభవాన్ని ఆమె మరవలేకపోయింది.

ఆ పగలల్లా అలాదీన్ నగరమంతా తిరిగి వినోదాలు చూశాడు. "మంత్రికొడుకు చేసుకున్న అదృష్టం! అతను రాజుగారికి అల్లుడయాడు!" అని అందరూ అనుకోవటం వింటే అలాదీన్‌కు నవ్వొచ్చింది. పెళ్లి రాత్రి యావత్తూ ఆ మంత్రికొడుకు పెంట కుప్ప మీద పడుకున్నాడని ప్రజలకు తెలియదు!

రెండో రాత్రికూడా అలాదీన్ రాజకుమార్తెను దీపంభూతం చేత తన గదికి



తెచ్చింది, ఆమెకూ తనకూ మధ్య కత్తి అడ్డం పెట్టి పడుకున్నారు. దీపం భూతం మంత్రి కుమారుణ్ణి పెంట కుప్పమీద పడుకోబెట్టింది. మళ్ళీ తెల్లవారగానే వాళ్ళిద్దరూ ఎప్పటిలాగే రాజభవనంలో ఉన్నారు.

రాజుగారు తన కూతురివద్దకు వెళ్ళి, "అమ్మాయీ, ఎలా వున్నావు?" అని అడిగాడు. కాని రాజకుమార్తె జవాబు చెప్పక, తండ్రికేసి మరింత బెదురుగా చూసింది.

బెల్లంకొట్టిన రాయిలాగా తన కూతురు జవాబు చెప్పకపోవటం చూసి మండిపోయి, రాజు, "నిన్న చూశాను, ఇవాళ చూస్తున్నాను, అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పక అలా గుడ్లుపెట్టుకు చూస్తావేం? అంత పొగరెక్కిందా? చూడు, ఏమ్మేంచేస్తానో!" అంటూ కత్తిదూశాడు.

రాజకుమార్తె హడలిపోయింది. ఆమె కన్నీరు కారుస్తూ, "నాన్నా, నిజం తెలిస్తే నన్నుచూసి జాలిపడతావు గాని నామీద కోప్పడవు. నేను అసలే నరకం అనుభవిస్తున్నాను," అని రాజుతో జరిగినదంతా చెప్పింది. "ఇదంతా పెళ్ళికొడుక్కుకూడా తెలుసు. నా మాటలో నమ్మకం లేకపోతే ఆయనను అడుగు," అన్నదామె. రాజుగారు తన కుమార్తెను చూసి జాలిపడి, "పిచ్చి



దానా, ఈ సంగతి నిన్ననే చెప్పి ఉంటే రక్షకభటులను ఏర్పాటుచేసి, నీకు ఏ ప్రమాదమూ రాకుండా కాపాడి ఉందును గదా! ఇవాళ రాత్రికి నీకే ఆపదా కలగకుండా నేను చూస్తాను. జరిగినదంతా మరిచిపోయి నిశ్చింతగా ఉండు," అన్నాడు.

తరవాత ఆయన మంత్రిని పిలిపించి, "ఏమిటిదంతా? గడిచిన రెండు రాత్రుల సంఘటనలను గురించి నీ కొడుకు నీతో ఏమైనా చెప్పాడా?" అని అడిగాడు.

"మహారాజా, ఈ రెండు రోజులూ నేను నా కొడుకును కలుసుకోనే లేదు. నాకేమీ తెలియదు," అన్నాడు మంత్రి.





రాజు తన కుమార్తె తెలిపిన విషయా లన్నీ మంత్రికి చెప్పి, "అసలు ఏం జరిగినదీ నీ కొడుకును అడిగి తెలుసుకో. నా కూతురు కంగారుపడి నిజం గ్రహించక పోయి ఉండవచ్చు," అన్నాడు.

మంత్రి తన కొడుకును పిలిపించి, రాజకుమార్తె చెప్పిన విషయాలు చెప్పి, "ఇదంతా నిజమేనా?" అని అడిగాడు.

"రాజకుమార్తె అబద్ధం చెప్పవలసిన గతేం పట్టింది, నాన్నా? నా సంగతి మరీ అన్యాయం. రెండు రాత్రులూ నేను పెంటకుప్పమీద పడుకున్నాను. చలికి ఎముకలన్నీ బిగుసుకుపోయాయి. నాకీ పెళ్ళి వద్దు, నాన్నా. దీన్ని రద్దుచేయించు. ఇంకో రాత్రి నేనా పెంటకుప్పమీద పడుకోలేను, రాజుగారి అల్లుణ్ణి కాకపోయినా మానె!" అన్నాడు మంత్రికొడుకు.

ఈ మాట వినగానే మంత్రికి చాలా కష్టంవేసింది. ఈ పెళ్ళి జరిగించటానికి ఆయన విశ్వప్రయత్నం చేసిఉన్నాడు. అందుచేత ఆయన తన కొడుకుతో, "నాయనా, నువు తొందరపడకు. ఈ రాత్రి ఏం జరుగుతుందో చూద్దాం. ఇలాటి అదృష్టం మళ్ళీరమ్మంటే రాదు," అన్నాడు. తరవాత మంత్రి రాజుగారిదగ్గిరికి వెళ్ళి, "మహాప్రభూ, రాజకుమార్తె చెప్పినదంతా నిజమే! మావాడుకూడా చెప్పాడు," అన్నాడు.

"అయితే ఈ పెళ్ళిని ఇప్పుడే రద్దు చేస్తున్నాను," అంటూ రాజుగారు పెళ్ళివేడుకలన్నీ ఆపవలసినదిగా ఉత్తరువిచ్చారు.

పెళ్ళి రద్దయిందని తెలియగానే ప్రజలు ఆశ్చర్యపడ్డారు. రాజుగారి ఇంటినుంచి మంత్రి, మంత్రికొడుకూ కోపంగా వెళ్ళిపోవటం జనం కనిపెట్టి, "ఏం జరిగింది? పెళ్ళి ఎందుకు రద్దయింది?" అని అడగసాగారు. కాని జరిగినదేమిటో అలాదీన్‌కు తప్ప మరెవరికీ తెలియదు.

(ఇంకా ఉంది)



# అద్భుతదీపం

## 6

[తన కుమార్తెను అలాదీన్‌కిచ్చి చేస్తానని మాటఇచ్చి మూడునెలలు గడువడిగిన రాజుగారు మంత్రిమాటలు విని, అన్నమాట కాస్తా తప్పి, గడువులోపలనే తన కుమార్తెను మంత్రి కొడుకుకిచ్చి పెళ్ళిచేసేశాడు. ఈ సంగతి తెలిసి అలాదీన్ దీపంభూతం సహాయంతో పెళ్లి నిష్ఫలమయేటట్టు చేశాడు. పెళ్లి రద్దయిపోయింది. పెళ్లివినోదాలన్నీ కట్టిపెట్టబడ్డాయి.]

రాజుకూతురు బుదూర్‌కూ మంత్రికొడుకుకూ జరిగిన పెళ్లి రద్దయిపోయిందనీ, రాజుగారు మంత్రికొడుకును దూరప్రాంతానికి పంపేశారనీ ప్రజలందరికీ తెలిసిపోయింది. ఈ సంగతి విని అలాదీన్ ఎంతో సంతోషించాడు, తన దీపాన్ని మెచ్చుకున్నాడు. రాజకుమార్తె వివాహం ఎలా భగ్నమయినదీ తనకు తప్ప ఇంకొక నరమానవుడికి తెలియదు, అందుకుకూడా అతను చాలా సంతోషించాడు.

త్వరలోనే రాజుగారు పెట్టిన మూడు నెలల గడువు పూర్తిఅయింది. అలాదీన్ తన తల్లిని రాజుగారి దర్శనంకోసం వెళ్ళమన్నాడు. ఆమె తనకు గల దుస్తులన్నిటిలోకీ మంచివి ధరించి రాజసభకు వెళ్లింది.

ఆమె సభలో అడుగుపెడుతూండగానే రాజుగారు ఆమెను గుర్తించాడు. అయన తన మంత్రితో, "అలాదీన్ తల్లి వస్తున్నది. గడువు తీరింది గనక అమ్మాయిని తన కుమారుడికిచ్చి చెయ్యమంటుందను

వి. ప్రసాదరావు

ఉంటాను. మూడు నెలలు గడువు పెట్టిన సంగతి నాకు జ్ఞాపకం రావటం మంచిదయింది," అన్నాడు.

మంత్రి తనకు జరిగిన అవమానాన్ని ఇంకా మరవలేదు. ఆయన రాజుతో, "మహారాజా, తమవంటివారు ఆడినమాట తప్పకపోవటం మంచిదేగాని, చేసుకోబోయే అల్లుణ్ణి గురించి కొంతలో కొంత తెలిసి ఉండటంకూడా అవసరమే. బొత్తిగా ముక్కూ మొహమూ ఎరగనివాడికి పిల్ల నెలా ఇస్తారు? ఈ అలాదీన్ గురించి నాకు తెలుసుగాని మీకు బొత్తిగా ఏమీ తెలియదు. ఇతని తండ్రి ఒక పేద దర్జీవాడు. పేదరికం తోనే మరణించాడు. అలాటివాడి కొడుకు సంపన్నుడని ఎలా నమ్మటం?" అన్నాడు.

"దేవుడు కరుణిస్తే ఎవడైనా సంపన్నుడు కావచ్చు," అన్నాడు రాజు.

"అలా జరిగిందనైనా మనకు దాఖలా ఉండాలిగా! నాసలహా ఏమంటే, ఈ అలాదీన్‌ను పెద్ద ఎత్తున కట్నం అడగండి. అతను తీసుకురాగలిగిననాడు మనం కళ్ళు మూసుకుని ఈ సంబంధానికి ఒప్పుకోవచ్చు," అన్నాడు మంత్రి.

"నువ్వు చెప్పింది దివ్యంగా ఉంది, మంత్రీ. ఆ ముసలావిణ్ణి ముందుకు



రమ్మను," అన్నాడు రాజు. మంత్రి పిలవగానే అలాదీన్ తల్లి రాజుగారిని సమీపించి ప్రణామం చేసింది.

"మేము చేసిన వాగ్దానాన్ని మరిచిపోలేదని అక్కగారు తెలుసుకోవాలి. అయితే మనం లోగడ పెళ్ళికూతురి కట్నకానుకలను గురించి మాట్లాడుకుని ఉండలేదు. పెళ్ళి కూతురు రాజకుమార్తె అని, గొప్ప పుటక పుట్టినదనీ అక్కగారు మరిచిపోరాదు. పెళ్ళికూతురి కట్నంలో ఏమేమి ఉండాలంటే:—నలభై పోతబంగారం పళ్ళాలనిండా రత్నాలు రాసులు పొయ్యాలి. ఆ రత్నాలు కూడా పూర్వం నాకు కానుకగా ఇచ్చిన



వాటిలాటివే అయిఉండాలి. ఈ నలభై పళ్ళాలనూ నలభైమంది అప్సరసలవంటి ఆడబానిసలు రాజభవనానికి పట్టుకు రావాలి. వారివెంబడి నలభైమంది నల్ల బానిసలు పహరా రావాలి. ఈ కట్నాలు తెచ్చి మాముందు పెట్టిన మరుక్షణం పెళ్ళి ఖరారు అవుతుంది. అదివరకే మీ కుమారుడు నాకు కానుక పంపిఉన్న కారణం చేత నేనింతకన్న ఎక్కువ కోరదలచలేదు!" అన్నాడు రాజుగారు.

ఈ కోరిక వినగానే అలాదీన్ తల్లికి గుండె ఆగిపోయినంత పని అయింది. ఆమె రాజుగారికి మళ్లీ ప్రణామం చేసి మారుమాట



లేకుండా తిరిగి వచ్చేసింది. ఆమె ఇంట్లో అడుగు పెడుతూనే అలాదీన్‌తో, "ఈ రాజకుమార్తె ప్రమేయం మనకు వద్దని నేను అప్పుడే చెప్పలేదుట్రా?" అన్నది.

ఆమె అలాదీన్‌తో రాజుగారన్న మాటలు చెప్పి, "పోనీ బంగారుపళ్లాలూ, రత్నాలూ అంటే నేనూ ఒప్పుకుంటాను. నువు అసలే పిచ్చిలో ఉన్నావు గనక ఆ భూగర్భంలో ఉన్న గుహకు వెళ్ళి చెట్లమీద కాసే రత్నాలు ఒలిచి తెస్తావు. కాని నలభైమంది ఆడబానిసలనూ, నలభైమంది మగబానిసలనూ తెమ్మంటే అది మనవల్ల అయే పనేనా, నాయనా? నువు మాత్రం ఎక్కణ్ణుంచి తెస్తావు? ఆ ముచ్చుముండాకొడుకు చెవిలో ఏదో ఊదబట్టే రాజు ఇంత కట్నం అడిగాడు. కనుక ఈ ప్రయత్నం మానుకో, బాబూ. లేకపోతే ఊబిలో దిగబడిపోయి నష్టపుతుంది నీపని!" అన్నది.

అలాదీన్ ఈ మాటలకు నవ్వాడు. "అమ్మా, రాగానే నీ మొహం చూసి నిజంగా చెడువార్తే తెచ్చావని భయపడ్డాను. కాని నువు ఉత్తపుణ్యానికి కంగారుపడుతున్నావని నాకిప్పుడు తెలిసిపోయింది. నేనివ్వగలదానిలో రాజుగారడిగినది ఎన్నోవంతు! అందుచేత నువు నీ పిచ్చి అను





మానాలన్నీ కట్టిపెట్టి ముందు వంటచెయ్యి. నాకు ఆకలి దహించుకుపోతున్నది. ఇక రాజుగారి మాటంటావా, అదంతా నేను చూసుకుంటాలే!" అన్నాడతను తల్లితో.

తల్లి తన పనిమీద అవతలికి వెళ్ళగానే అలాదీన్ తన గదితలుపు గడియ పెట్టి, లాంతరు తీసి రుద్దాడు. వెంటనే భూతం ప్రత్యక్షమై, "ఏం సెలవు?" అన్నది.

అలాదీన్ భూతంతో రాజుగారు కోరిన కట్నంమాట చెప్పి, నలభై పాతబంగారపు పళ్ళాలనిండా రత్నాలనూ, నలభైమంది ఆడబానిసలనూ, మగబానిసలనూ హాజరు పెట్టమని ఆజ్ఞాపించాడు.

భూతం అదృశ్యమై మరుక్షణమే అలాదీన్ కోరిన వాటితోసహా హాజరయింది. నలభైమంది ఆడబానిసలనూ గోడవెంబడి, నెత్తిన పాతబంగారు పళ్ళాలతోసహా, వాటి నిండా పెద్దపెద్ద రత్నాలతోసహా, నిలబెట్టి అలాదీన్‌కు చూపించింది. నలభైమంది మగ బానిసలుకూడా ఉన్నారు. అన్నీ సరిచూసుకుని అలాదీన్ భూతాన్ని పంపేశాడు.

సరిగా ఈ సమయానికే అలాదీన్ తల్లి వంటసామగ్రితో తిరిగివచ్చి తన ఇంటి ముందు మూగిన మగబానిసలను చూసి, తన కొడుకును దండించటానికిగాను రాజుగారు పంపారని హడలిపోయింది. కాని అంతలోనే అలాదీన్ ఆమెను సమీపించి, "అమ్మా, నీకు మళ్ళీ ప్రయాణం తగిలింది. ఈ బానిసలనూ, కట్నాలనూ తీసుకుని మళ్ళీ రాజుగారిని చూడాలి," అన్నాడు.

ఆమెకిప్పుడు నిజం తెలిసింది. ఆమె బానిసలను వెంటబెట్టుకుని బయలుదేరింది. ఈ వింతఊరేగింపును చూడటానికి జనం ఎగబడసాగారు. అలాదీన్ తల్లి రాజభవనం చేరేసరికి వీధులు పట్టనంతమంది జనం ఊరేగింపు వెంట చేరారు. ఏం జరుగుతున్నదో ఎవరికీ తెలియదు. అంచేత ప్రజలు కోలాహలంగా మాట్లాడుకుంటూ ఎవరిచిత్తం

వచ్చినట్టు వాళ్ళు కథలు అల్లేస్తున్నారు. అందగత్తెలైన బానిసలూ, వారినెత్తిన ధగధగలాడే బంగారుపళ్ళాలూ, వాటిలో కుప్పలుగా పోసి కిరణాలు వెదజల్లుతున్న అపూర్వమైన రత్నాలూ—ఇవి మాత్రం ప్రతిఒక్కరికీ అర్థమయాయి. ఈ వైభవమంతా చూసి కొందరు, ఎవరో గొప్ప రాజుగారు నగరానికి వచ్చారని పుకారు లేవదీశారు.

అడబానిసలు రాజద్వారం ప్రవేశించేటప్పుడు ద్వారరక్షకులు వారిని ఆపటానికి ప్రయత్నించకపోగా, కంగారుపడి పక్కకు తొలిగి దారిఇచ్చారు. రక్షకభట నాయకుడు మొదటి నీగ్రోబానిసను చూడగానే నీగ్రోల చక్రవర్తి అనుకుని, వంగి సలాము చేశాడు! నీగ్రోవాడు నవ్వి, "నేను బానిసను. నా యజమాని వెనకగా రాబోతాడు!" అన్నాడు.

సభలో వివిధవిషయాలు చర్చిస్తున్న రాజుగారు అంత దూరాన బానిసల బారు చూడగానే సభ చాలించి, వచ్చినవారిని తనవద్దకు పంపమని ఉత్తరువిచ్చాడు. బానిసలు వచ్చి సింహాసనముందు అర్థచంద్రాకారంలో నిలబడ్డారు. పళ్లాలను దింపటానికి అడబానిసలకు మగబానిసలు సహాయం చేశారు. తరవాత ఎనభైమంది బానిసలూ రాజుగారి ముందు సాష్టాంగపడి లేచి, చేతులు కట్టుకు నిలబడ్డారు.





ఇదంతా జరిగాక అలాదీన్ తల్లి ముందుకు వచ్చి, రాజుగారికి ప్రణామం చేసి, "మహారాజా, మీ సేవకుడు అలాదీన్ రాజకుమార్తెకు పంపిన కట్నం స్వీకరించండి. రాజకుమార్తెకు తగిన కట్నం తమరు కోరనేలేదని మావాడు తమతో మనవి చెయ్యమన్నాడు. కాని తమరు ప్రస్తుతానికి ఈ స్వల్పకానుక స్వీకరించినట్టయితే ముందుముందు దీన్ని మించే కానుకలు వస్తాయన్నాడు," అన్నది.

రాజుగారికి మతిపోయింది. ఆయన సింహాసనంమీద చేరగిలబడి, నోటమాటలేక రత్నరాసులకేసీ, బానిసలకేసీ చిత్తరపోయి చూస్తూ, అలాదీన్ తల్లి అన్న మాటలు కూడా సరిగా వినలేకపోయాడు. చిట్టచివరకాయన మంత్రికేసి తిరిగి, "మంత్రీ, ఈ సంపదముందు మనసంపద దివిటీముందు దీపంగదా! మనమాట మననోట ఉండగానే ఇలాటి కట్నం పంపినవాణ్ణి గురించి ఏమనుకోవాలి! ఈ వైభవం ముందు అమ్మాయి ఎంత?" అన్నాడు.

రాజుగారి మాటలకు ఎదురు చెప్పే ధైర్యం మంత్రికి లేదు. అయినా ఆయన, "అలా అనకండి, మహారాజా. ఈ రత్నరాసులెంత విలవైనవయినా అమ్మాయిగారి విలవ ఇంకా హెచ్చు," అన్నాడు.





"ఒక్కనాటికి కాదు. అంతేకాదు, నేను అమ్మాయిని ఈ అలాదీన్‌కిచ్చి పెళ్ళిచేస్తే, ముందూ వెనకా ఆలోచించక అకార్యం చేశానని నువ్వు అనలేవుకూడా!" అన్నాడు రాజు. ఆయన తనచుట్టూ మూగిన సభికులకేసి ప్రశ్నార్థకంగా చూశాడు. వారు ఏకగ్రీవంగా తలలు వంచి, రాజుగారి అభిప్రాయం సరిఅయినదని సూచించారు.

రాజుగారు ఇక సందేహించలేదు. అలాదీన్ తన కుమార్తెకు ఎలాటి భర్త అవుతాడో అన్న అనుమానంకూడా ఆయనకు కలగలేదు. ఆయన అలాదీన్ తల్లికేసి తిరిగి, "అక్కగారూ, ఈ క్షణంనుంచి నీ కొడుకు అలాదీన్ నాతో సమమైన వంశగౌరవం గలవాడు, నా బంధుకోటిలో వాడు. అతన్ని ఎప్పుడు ఆలింగనం చేసుకుంటానా, ఎప్పుడు నా కుమార్తెనిచ్చి పెళ్ళిచేస్తానా అని తహతహలాడిపోతున్నాను!" అన్నాడు.

అలాదీన్ తల్లి రాజుగారివద్ద సెలవు తీసుకుని వాయువేగంతో ఇంటికి తిరిగివచ్చి, కొడుకుతో జరిగినదంతా చెప్పింది.

తాను ఎంతో ప్రయాసపడ్డమీదట తన కోరిక సిద్ధించినందుకు అలాదీన్‌కు పరమానందమయింది. కాని అతను ఈ ఆనందాన్ని పైకి కనబరచక, "అమ్మా, ఈశ్వరుడి అనుగ్రహంవల్లా, నీ ఆశీర్వచనంవల్లా, నువ్వు పడిన శ్రమవల్లా ఇది సాధ్యమయింది," అని తల్లికి తన కృతజ్ఞత తెలుపుకుని, రాజుగారిని చూడబోవటానికి ప్రయత్నాలు ప్రారంభించాడు.

అతను ఒంటరిగా తన గదిలోకి వెళ్ళి మరోసారి దీపంభూతాన్ని రప్పించాడు. భూతం రాగానే అతను, "భూతమా, నాచేత చక్కగా స్నానం చేయించి, ప్రపంచంలో ఏ మహారాజుకూ లేని ఉడుపులు కట్టబెట్టు!" అన్నాడు.

భూతం అతన్ని తన భుజాలమీద ఎక్కించుకుని ఒక్కక్షణంలో ఒక స్నాన



శాలలో దింపింది. అటువంటి అద్భుతమైన స్నానశాల ప్రపంచంలో ఎక్కడా లేదు. అది స్ఫటికంలాటి చలవరాతితో నిర్మించినది. అందులోని స్నానాల తొట్లు రోజా రంగు యమునారాళ్లతోనూ, తెల్లని పగడపు రాళ్లతోనూ కట్టారు. వాటిచుట్టూ నవరత్నాలు పొదిగారు. అక్కడ అనేక భూతాలు అలాదీన్‌కు ఒళ్లుపట్టి, పన్నీట స్నానం చేయించాయి. దీని ఫలితంగా అతని శరీరానికి గులాబీపువ్వు ఛాయ వచ్చింది.

తరవాత అతనికి అపూర్వమైన దుస్తులు తెచ్చి ఇచ్చారు. వాటి అందం వర్ణనాతీతం. వాటిని ధరించి అలాదీన్ ఏ స్వర్గంనుంచో భూమికి దిగిన దేవరాజకుమారుడల్లే వున్నాడు. భూతం అతన్ని తిరిగి ఇంటికి తెచ్చి చేర్చింది.

అలాదీన్ భూతంతో, "నాకిప్పుడొక మేలు జాతిగుర్రం కావాలి. అలాటి గుర్రం రాజుగారి దగ్గిరకూడా ఉండకూడదు. దానిపైన లక్ష దీనారాల విలువగల జీనుండాలి. నాకు నలభైఎనిమిదిమంది బానిసలు కావాలి. వారందరికీ అందమైన దుస్తులుండాలి. వారిలో సగంమంది నాకు ముందూ, మిగిలినవాళ్లు నావెనకా, రెండు బారులుగా ఏర్పడి నడుస్తారు. మా అమ్మకు పన్నెండుమంది అత్యంత సౌందర్యవతులైన ఆడ బానిసలు





కావాలి. పన్నెండుమంది పన్నెండు రంగుల బట్టలు రాజకుమార్తెకోసం తీసుకురావాలి. నా బానిసలలో ప్రతి ఒక్కడిదగ్గిరా అయిదేసివేల దీనారాల సంచీ ఉంచు, నాఖర్చుకు కావాలి. ప్రస్తుతానికి ఇదే నీవల్ల నాకు కావలిసింది," అన్నాడు.

మరుక్షణంలో అలాదీన్ కోరినవన్నీ హాజరయాయి. అతను గుర్రంమీద ఎక్కి కూచున్నాడు. అంతకుపూర్వం అతను ఎన్నడూ గుర్రపుస్వారి చేసి ఎరగడు, అయినా అతని కది కొత్త అనిపించలేదు. అతను కదలగానే ముందూ, వెనకా నిలబడి ఉన్న బానిసలుకూడా కదిలారు.

అతను వీధులవెంట పోతుంటే మళ్ళీ జనం మూగారు. ఇళ్ళ కప్పులపైన, కిటికీల వద్దా జనం చేరి ఈ ఊరేగింపు చూడసాగారు. అలాదీన్ ఆజ్ఞప్రకారం బానిసలు, వీధుల నిండా కిటకిటలాడే జనంమీద బంగారం విదజల్లారు. దారిపొడుగునా జనం అలాదీన్ అందాన్నీ, వైభవాన్నీ వెయ్యికళ్ళతో చూసి ఆనందించారు.

అతను వస్తున్నాడన్న వార్త రాజుగారికి ముందుగానే తెలిసింది. ఆయన అలాదీన్‌కు స్వాగతం చెప్పటానికి వేచిఉన్నాడు. అలాదీన్ను చూడగానే రాజుగారికి అతని విలువైన దుస్తులూ, ఠీవీ కొట్టవచ్చినట్టు కనపడ్డాయి. ఆయన అతన్ని ఆలింగనం చేసుకున్నాడు. చుట్టూ ఉన్న రాజపరివారంలో వారందరూ పెద్దపెట్టున హర్షధ్వానాలు చేశారు. బాజాలు మోగాయి.

రాజుగారు అలాదీన్ను నడిపించుకుని సన్మానభవనానికి తీసుకుపోయి తన పక్కనే కూచోబెట్టుకుని, "అలాదీన్, నీ పెళ్ళికి మూడు మాసాలు గడువు అడిగినందుకు విచారిస్తున్నాను. నిన్ను అల్లుడుగా చేసుకునేటందుకు ఎగిరి గంతువెయ్యని మహారాజు ప్రపంచంలో ఉంటాడనుకోను!" అన్నాడు. —(ఇంకా ఉంది)



# అద్భుతదీపం

7

[రాజకూతురు బదురుకూ మంత్రికొడుకుకూ జరగవలసిన వివాహాన్ని అలాదీన్ రెండోకంటివాడికి తెలియకుండా భగ్నం చేసి, రాజుగారు పెట్టిన గడువు తీరగానే, రాజకుమార్తెను తనకిచ్చి వివాహం చేయమని తల్లిద్వారా కబురుచేశాడు. మంత్రి సలహాతో రాజుగారు తన కుమార్తెకు వల్లమాలిన రత్నరాసులు కట్నం కోరాడు. దీపం భూతం సహాయంతో అలాదీన్ కట్నం పంపాడు. తరవాత రాజుగారు అలాదీన్‌ను పిలిపించి ఘనంగా స్వాగత మిచ్చాడు.]

సభాభవనంలోనే రాజుగారికీ అలాదీన్‌కూ భోజనం ఏర్పాటయింది. మంత్రి స్వయంగా వారికి పరిచర్య చేశాడు. మిగిలిన సభికు లంతా అక్కడే ఉన్నారు.

భోజనం పూర్తికాగానే రాజుగారు పురోహితులు మొదలైన వారిని పిలిపించి తన కుమార్తెను అలాదీన్ కిచ్చి పెళ్ళిచేసే విషయం స్థిరపరిపించాడు. తరవాత ఆయన అలాదీన్‌ను, "నాయనా, పెళ్ళిముహూర్తం ఎప్పటికి ఏర్పాటు చేయమన్నావు?" అని అడిగాడు.

"మహారాజా, ముహూర్తం ఎప్పుడు ఏర్పాటుచేసినా నాకు సమ్మతమే. కాని నేనూ నా భార్యా కాపరం ఉండటానికిగాను ఒక అద్భుత భవనం నిర్మించాలనే ఉద్దేశంతో ఉన్నాను. ఆ భవనం తయారుకాగానే

బి. ప్రసాదరావు



నేను పెళ్ళి చేసుకుంటాను!" అన్నాడు అలాదీన్.

"ఈ భవనం ఎక్కడ నిర్మిస్తావు?" అని రాజు అడిగాడు.

"తమ సెలవైతే, రాజభవనానికి ఎదురుగా ఉన్న విశాలమైన ఆవరణలో నిర్మిస్తాను. మీ కుమార్తె మీకు ఎంత దగ్గరలో ఉంటే అంత మంచిదిగదా! నేనుకూడా తరుచు తమ దర్శనం చేసుకుంటూ ఉండవచ్చు," అన్నాడు అలాదీన్.

"ఇందుకు నా అనుమతి వేరే కోరాలా? నీ యిష్టం వచ్చిన చోట కట్టుకో! కాని పని త్వరగా ముగిసేటట్టు చూడు. నా కుమార్తె ఎప్పుడు పెళ్ళాడుతుందా, ఎప్పుడు మనమలను ఎత్తుకొంటానా అని నేను తొందరపడుతున్నాను," అన్నాడు రాజు.

అలాదీన్ ఈ మాటలు విని చిరునవ్వు నవ్వి, రాజుగారివద్ద సెలవుతీసుకుని తన ఇంటికి వచ్చేశాడు. అతను ఇల్లు చేరుతూనే తల్లితో జరిగిన విషయాలన్నీ చెప్పి, తన గదిలోకి వెళ్ళి తలుపువేసుకుని, దీపాన్నితీసి రుద్ది, భూతాన్ని ఆవాహనచేశాడు.

భూతం వచ్చి, "ఏం సెలవు?" అని అడిగింది.

"నా కోరికలను తీర్చటంలో నువు చాలా సమర్థత చూపిస్తున్నావు. ఈసారి ఇంకా సమర్థత చూపాలి. నేనూ నాభార్యా కాపరం ఉండటానికిగాను ఒక అద్భుతమైన భవనం రాజభవనానికెదురుగా ఉన్న ఖాళీ స్థలంలో నిర్మించాలి. దాని రచన యావత్తూ నీకే వదిలిపెడుతున్నాను; ఎక్కడ ఏ యే రత్నాలు పొదుగుతావో నువే చూసుకో. కాని భవనంమధ్యలో స్ఫటికంతో చేసిన బురుజు చాలాపెద్దది లేపి, దానికి అమర్చే స్తంభాలు వెండితోనూ, బంగారంతోనూ పోతపోసినవిగా ఉండేటట్టు చూడాలి. ఆ బురుజుకు తొంభైతొమ్మిది గవాక్షాలు అమర్చి, వాటికి వజ్రాలూ, కెంపులూ, పచ్చలూ పొదగాలి.



తొంభైతొమ్మిదవ కిటికీకి మాత్రం రత్నాలు పొదగకుండా వదిలెయ్యి. భవనం ముందు జలయంత్రాలతోనూ, నీటి కాలవలతోనూ సహా చక్కని ఉద్యానవనం నిర్మించు. భవనం అడుగున ఒక రహస్యమైన మాళిగ నిర్మించి, దానినిండా బంగారు నాణాలు పేర్చు. ఇక, వంటఇల్లూ, అశ్వశాలా, బానిసల నివాసాలూ మొదలైనవి ఏవిధంగా ఏర్పాటు చేస్తావో చేసుకో. పని పూర్తికాగానే నాకు తెలియజెయ్యి!" అన్నాడు అలాదీన్ దీపంభూతంతో.

"చిత్తం," అని భూతం వెళ్ళిపోయింది.

మర్నాడు తెల్లవారేవేళ భూతం అలాదీన్‌ను నిద్రలేపి, "తమపని పూర్తిఅయింది, వచ్చి చూసుకోండి," అన్నది. అతను సరే నన్నమీదట ఆ భూతం అతన్ని ఎత్తుకుపోయి కొత్తగా నిర్మించిన భవనాన్ని చూపింది. ఈ భవనం రాజభవనానికి ఎదురుగా, అంతకంటె చాలారెట్లు రమ్యంగా ఉన్నది. ఆ భవనానికి చేరటానికి రెండు మార్గాలు పాలరాయి పరిచివున్నాయి. భవనాన్ని బయటినుంచి చూశాక అలాదీన్ లోపలిభాగాలు చూడటానికి భూతాన్ని వెంటబెట్టుకుని వెళ్ళాడు. భవనంలోపల అతనికి తాను కలలోకూడా ఊహించలేని మహావైభవం ప్రత్యక్షమయింది. భూమి లోపల ఒక రహస్య ధనాగారం, ఎంతో విశాలమైనది, నిర్మించి వున్నది. దానినిండా బంగారు దీనారాలునింపిన సంచుల దొంతర లున్నాయి. రాజుగారి దివాణంలో ఉండదగిన వంటశాలలూ, కచ్చేరి చావడులూ, కొట్లూ, అశ్వశాలలూ, సమస్తమూ ఈ భవనంలో ఉన్నాయి. అశ్వశాలలలో మేలుజాతి గుర్రాలున్నాయి. వాటిని కాసావాళ్ళు మాలీసు చేస్తున్నారు. వాటి దాణాకు వెండి తొట్లు ఏర్పాటయాయి.

అలాదీన్ చాలా సంతోషించాడు. అతను భూతంకేసి తిరిగి, "ఒక్కటి మరిచి

పోయావు. నాభార్య మా యింటినుంచి రాజభవనానికి నడిచిపోవటానికి ఒక పొడుగాటి తివాసీ రెండు భవనాలకూ మధ్య పరిచెంచు," అన్నాడు.

"చిత్తం!" అన్నది భూతం. మరుక్షణం రెండు భవనాల మధ్యా ఒక మెత్తని తివాసీ పరిచి ఉన్నది.

"ఇప్పుడే వంకా లేదు. ఇక నన్ను మా ఇంటికి తీసుకుపో!" అన్నాడు అలాదీన్.

అతను వెళ్ళిపోయిన కొద్దిసేపటికల్లా రాజుగారి దేవిడీ తలుపులు తెరిచారు. రాజుగారి నౌకర్లూ, చాకర్లూ తమ పనులమీద రాజభవనం నుంచి బయటికి వచ్చి, ఎదురుగా ఉన్న కొత్త భవనాన్ని చూసి ఆశ్చర్యంతో స్తంభించిపోయారు. ఆ భవనం మాణిక్యకాంతులతో, అప్పుడే ఉదయించిన సూర్యబింబంలాగా వెలిగిపోతున్నది.

వారు వెనక్కు తిరిగి వెళ్ళి ఈ వింతను మహామంత్రికి నివేదించారు. ఆయన వెళ్ళి రాజుగారితో చెప్పాడు. "మహారాజా, అమ్మాయిగారిని పెళ్ళాడనున్న యువకుడు ఇంద్రజాలం నేర్చినవాడులాగా కనబడుతున్నాడు," అన్నాడాయన.

"నువు వట్టి మూర్ఖుడులాగున్నావు! అసూయతో నీ బుద్ధి పెడతల పట్టినట్టున్నది! అంత ధనికుడు తలుచుకుంటే ఒక్క



రాత్రిలో ఇలాటి భవనం కట్టలేడా?" అన్నాడు రాజు.

రాజుగారికి అలాదీన్‌పై పూర్ణానుగ్రహం కలిగిందనీ, అతనిపైన ఏమి చెప్పినా రాజుగారి తలకెక్కదనీ తెలుసుకుని మంత్రి మాట్లాడక ఊరుకున్నాడు.

ఈ లోపుగా అలాదీన్ యింటికి వెళ్ళి పరిచారికలచేత తల్లికి మంచి ఉడుపులు ధరింపజేశాడు. ఆమె ప్రయాణానికి సిద్ధమయాక, "అమ్మా, ఇక నీ కోడలిని ఇంటికి తెచ్చుకోవచ్చు. పోదాం, పద!" అన్నాడు.

అలాదీన్ తల్లి తన పన్నెండుగురు పరిచారికలనూ వెంటబెట్టుకుని రాజభవనానికి బయలుదేరింది. ఆమెకు కొంచెం వెనకగా అలాదీన్ తన గుర్రంమీద బయలుదేరాడు. అతనితోబాటు అతని సిబ్బందికూడా కదిలింది. రాజభవనం చేరుకున్నాక అలాదీన్ తన స్వంత భవనంకేసి వెళ్ళాడు, అతని తల్లి రాజభవనం ప్రవేశించింది.

రాజుగారు ఆమెకు ఆదరంతో స్వాగతమిచ్చి, ఆమెను రాణివాసంలోకి నౌకర్ల వెంట పంపాడు.

రాజకుమార్తె అలాదీన్ తల్లిని చూడగానే లేచివచ్చి ఎంతో వినయంగా ఆమెను ఆసనం మీద కూచోబెట్టి, ఫలహారం పెట్టించి, తాను అలంకరించుకోసాగింది.







రాజకుమార్తె అత్తవారింటికి బయలుదేరేటప్పుడు తన తల్లినీ తండ్రినీ కౌగలించుకుని కన్నీరు కార్చింది. తరవాత ఆమె తన అత్తగారివెంట బయలుదేరింది. ఆమెతోపాటు పదిమంది నౌకర్లూ, నూరుమంది దాసీలూ బయలుదేరారు. నాలుగువందలమంది జానిసలు రెండుభవనాలకూ మధ్య రెండు సోల్పులలో నిలబడ్డారు. వారి చేతులలో ఉన్న పళ్ళాలలో దీపారాధనలూ, కర్పూర హారతులూ, సాంబ్రాణి ధూపాలూ ఉన్నాయి. మంగళవాద్యాలు మోగుతూ ఉండగా, పెళ్ళికూతురు అడుగులో అడుగు వేసుకుంటూ తివాసీమీదుగా పుట్టింటినుంచి మెట్టినింటికి నడిచి వెళ్లింది. ఈ దృశ్యం చూడటానికి జనం దూరాన నిలబడి హర్షధ్వానాలు చేశారు.

దాసీలు రాజకుమార్తెను పెళ్ళికూతురు చేసి ఆమెకు గల సమస్త ఆభరణాలూ పెట్టారు. కొద్దిసేపటిలోనే రాజుకూడా వచ్చాడు. వారు తనకు చూపిన మర్యాదకు అలాదీన్ తల్లి పరవశురాలై, ఆనందాశ్రువులు రాల్చింది. వారు ముగ్గురూ ముచ్చటించుకుంటూండగా రాణి వచ్చింది. ఆవిడ అలాదీన్ తల్లిని పలకరించలేదు, వారి సంభాషణలో ప్రవేశించలేదు. ఇంతకూ ఈ పెళ్లి రాణికి ఏమాత్రమూ ఇష్టంలేదు. తన అల్లుడు అనామకుడన్నది ఆమెను బాధించింది. అలాదీన్ విషయంలో ఆవిడ మంత్రితో ఒకటయింది.

అలాదీన్ చిరునవ్వు నవ్వుతూ పెళ్లికూతురికి ఎదురు వచ్చి, ఆమెను లోపలికి తీసుకువెళ్ళాడు. బురుజుకింద హాలులో, రత్నాలు తాపిన కిటికీల మధ్య అలాదీన్, అతని తల్లీ, రాజకుమార్తె విందుభోజనానికి కూచున్నారు. ఆ వాతావరణమంతా చూసి రాజకుమార్తె నిర్ఘాంతపోయింది. తాను అటువంటిచోట అడుగుపెడతానని ఆమె ఎన్నడూ అనుకుని ఉండలేదు.



భోజనం అయినాక స్త్రీలువచ్చి నృత్యాలు చేశారు. ఆ నృత్యం రాజకుమార్తెకు దేవలోక నృత్యంగా తోచింది.

మర్నాడు ఉదయమే అలాదీన్ తన గుర్రాన్ని ఎక్కి రాజభవనానికి వెళ్ళి, తన మామగారిని తనవెంట విందుకు ఆహ్వానించాడు. రాజుగారందుకు సంతోషంగా ఒప్పుకుని, "అమ్మాయి ఎలా ఉన్నది?" అని అడిగాడు. అలాదీన్ తగురీతిగా సమాధానం చెప్పాడు. తరవాత ఇద్దరూ కలిసి అలాదీన్ ఇంటికి వచ్చారు.

ఆ భవనాన్ని బయటనుంచి చూసే రాజు ఎంతో ముచ్చటపడ్డాడు, ఇక లోపలకూడా చూసినాక ఆయన ఆశ్చర్యానికి మేరలేదు. అన్నిటికన్నా ఆయనను ప్రబలంగా ఆకర్షించినది బురుజుకింద హాలు. ఆయన దాన్ని వివరంగా పరీక్షించి, "భూప్రపంచంలో ఇటువంటి కట్టడం ఇంకొకటి ఉంటుందని నాకు తోచటంలేదు. కాని, అలాదీన్, ఇక్కడ ఉన్న కిటికీలలో ఒక్కటి మాత్రం రత్నాలు తాపటం చేయకుండా వదిలేశావేమిటి? మిగిలిన వాటితో పోలిస్తే ఇది బోసిగా ఉన్నదే?" అన్నాడు.

"పనివాళ్ళ తొందరవల్ల గాని అశ్రద్ధవల్ల గాని ఆ కిటికీపని పూర్తిచేయక వదిలాననుకునేరు. ఈ భవనం నేటినుంచీ మీ అమ్మాయి నివాసమందిరం. అందుచేత దాని నిర్మాణంలో మీకుకూడా కొంతపాలు ఉంటే మీ కీర్తికూడా ఇందులో చేరి ఉంటుంది గదా అని ఆ కిటికీ అలా ఉంచేశాను. దాని పని మీరు పూర్తి చెయ్యండి!" అన్నాడు అలాదీన్.

"నిజంగా ఎంత గొప్ప ఆలోచన చేశావోయ్! ఆ పని నాకు వదిలెయ్యి!" అంటూ రాజు తన భటులను పిలిచి, "ఒరే, మన శిల్పులను పిలవండి," అన్నాడు.

తరవాత ఆయన తన కుమార్తె వద్దకు వెళ్ళి ఆమెతో కాస్సేపు ముచ్చటించి, ఆమెకు

ఈ కొత్త జీవితం చాలా ఆనందదాయకంగా ఉందని తెలుసుకున్నారు. తరవాత తన కూతురితో, అల్లుడితో కలిసి భోజనంచేశారు.

ఇంతలో శిల్పులు వచ్చారు. రాజుగారు వారికి కిటికీ చూపి, "దీనినికూడా మిగిలిన కిటికీలలాగా అలంకరించండి," అని ఆజ్ఞాపించాడు. "చిత్తం, మహాప్రభూ!" అని వారు మిగిలిన కిటికీలన్నీ పరీక్షచేసి కంగారుపడుతూ రాజుగారి వద్దకు తిరిగి వచ్చి, "మన్నించండి, మహారాజా! మావద్ద ఉన్న రత్నాలన్నీ కలిపినా, ఈ కిటికీలో నూరో వంతు పొదగటానికి చాలవు. ఏం సెలవు?" అన్నారు వినయంగా.

రాజు తన భటులను పిలిపించి, అలాదీన్ తనకు పంపిన రత్నరాసులను తెప్పించాడు. వాటిని ఆయన శిల్పులకు చూపి, "వీటిలో కావలసినమటుకు మీరు వాడుకుని మిగతావి తిరిగి ఇచ్చెయ్యండి," అన్నాడు.

వారు కొలతలు వేసి, లెక్కలు కట్టి గుణించి, "మహారాజా, ఇవన్నీ కలుపుకున్నా కిటికీలో పదోవంతు అలంకరించటానికి సరిపోతాయి," అన్నారు.

రాజు కొంచెం కంగారుపడ్డాడు. ఆయన మళ్ళీ తన భటులను పిలిచి, "మన మంత్రి సామంతు లందరి దగ్గిరా ఎన్నెన్ని రత్నాలుంటే అన్నీ పట్టుకురండి," అన్నాడు.



భటులు వెళ్ళి కొద్దిసేపట్లో అందరివద్దా గల రత్నాలు మూటకట్టి తెచ్చారు. శిల్పులు వాటిని చూసి, "మహారాజా, ఇవికూడా కలుపుకుంటే కిటికిలో ఎనిమిదోవంతు అలంకరించవచ్చు. ఈ రత్నాలకింకా ఏడు రెట్లు తెప్పించండి. రత్నాలు రాగానే పని ప్రారంభించి మూడుసంవత్సరాలు విడవకుండా పనిచేసి ఈ కిటికీని మిగిలిన కిటికీలలాగా చేసేస్తాం!" అన్నారు.

రాజుగారికి తల తీసేసినట్టయింది. తన సామర్థ్యం ఈపాటికి రాజుగారు గ్రహించి ఉంటాడనుకొని నిశ్చయించి అలాదీన్, "మహారాజా! ఈ కిటికీ గురించి మీరిక బాధపడకండి. నేను ఇచ్చిన రత్నాలు తిరిగి తీసుకోవటం ఏమీ భావ్యంగా ఉండదు. మీ తరఫున నేనే ఆ కిటికీని పూర్తయేలా చూస్తాను," అన్నాడు.

రాజుగారు ఒక్క నిట్టూర్పు వదిలి తన కుమార్తెతో మాట్లాడటానికి వెళ్ళాడు.

ఈ లోపుగా అలాదీన్ దీపంభూతాన్ని ఆవాహన చేసి, "తొంభైతొమ్మిదో కిటికీని కూడా మిగిలినవాటిలాగే చెయ్యి," అన్నాడు.

కొద్ది క్షణాలలో ఆ కిటికీకూడా రత్నఖచితమైపోయింది. తరవాత రాజుగారు ఆ హాలులోకి అడుగుపెట్టి తొంభైతొమ్మిదో కిటికీని గుర్తించలేక పోయాడు. ఆ హాలు



చుట్టూ ఎన్నోసార్లు తిరిగినమీదట ఆయనకు ఆ కిటికీ పని పూర్తి అయినట్టు బోధపడింది. ఆయన అలాదీన్‌కేసి తిరిగి, "అలాదీన్, నిన్ను చూస్తున్నకొద్దీ నాకు ఆశ్చర్యం హెచ్చిపోతున్నదిసుమా!" అన్నాడు.

రాజు తన మంత్రికేసి తిరిగి, "ఇప్పుడేమంటావు?" అని వెటకారంగా అడిగాడు. "అంతా ఈశ్వర విద్విలాసం!" అన్నాడు మంత్రి. కాని అలాదీన్ మాంత్రికుడనీ, దుష్టశక్తులను వశపరచుకున్నవాడనీ మంత్రికి లోలోపల అనుమానం ఉండనే ఉన్నది.

ఇది మొదలు రాజుగారు ప్రతి సాయంకాలమూ తన కూతురి ఇంటికి వచ్చి అల్లుడితోనూ, కూతురితోనూ కాలక్షేపం చేయసాగాడు. వారి భవనాన్ని రోజూ చూస్తున్నప్పటికీ ఆయనకు అందులో ఏవో కొత్త వింతలు కనిపిస్తూనే ఉండేవి.

తాను ఇంతగా పైకి వచ్చినప్పటికీ అలాదీన్ ఉబ్బితబ్బిబ్బు కాలేదు. అతను తన చిన్నతనపు బీదరికాన్ని ఏమాత్రమూ మరవలేదు. అందుచేత అస్తమానమూ పేదల స్థితి బాగుచేయటానికి కృషిచేస్తూ, వారికి అనేక విధాల సహాయపడుతూ ఉండేవాడు. అతను వీధులవెంట వెళ్ళినప్పుడల్లా అతని బానిసలు బంగారం విరజిమ్ముతూ ఉండేవారు. అతని భవనంలో ఉదయమూ సాయంకాలమూ అయిదువేలమంది అన్నార్తులకు అన్నదానం జరిగేది. అంత గొప్పవాడైకూడా అతనిలో గర్వం లేశమైనా లేకపోవటంచేత అతనంటే గొప్పవారికీ, కొద్దివారికీకూడా ఎంతో అభిమానంగా ఉండేది.

ఇక అతని భార్య సంగతి చెప్పనే అక్కర్లేదు. ఏదో పూర్వపుణ్యంవల్ల తనకు ఈ భర్త దొరికాడనీ, ఇలాటివాడు ప్రపంచంలో మరొకడు ఉండడనీ ఆమె మనస్ఫూర్తిగా నమ్మింది. అలాదీన్ ఆ భార్యతోనూ, తన తల్లితోనూ సుఖంగా జీవితం వెళ్ళబుచ్చసాగాడు.

—(ఇంకా వుంది)






## 8

[దీపంభూతం సహాయంతో అలాదీన్ తన దారిద్ర్యాన్ని పోగొట్టుకోవటమే గాక, రాజకుమార్తెను పెళ్లాడి, రాజభవనానికి ఎదురుగా ఒక అద్భుతమైన భవనం కట్టుకుని, అందులో సుఖంగా జీవిస్తున్నాడు. పేదలను కనిపెట్టివుంటూ ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నాడు. అతని జీవితం మూడు పూవులూ, ఆరు కాయలూగా ఉన్నది. అయితే—]

ఆనాడు అలాదీన్‌ను భూమి అడుగున గుహలో బంధించి తన దేశానికి తిరిగిపోయిన మొరాకో మాంత్రికుడు అలాదీన్ తిండికి మాడి చనిపోయాడనే అనుకున్నాడు. తన చేతికి అద్భుతదీపం రానందుకు ఆయన చాలా చిరాకుపడ్డాడు. రోజూ ఆ దీపం జ్ఞాపకం వచ్చేది. వెంటనే అలాదీన్ మూర్ఖత్వంమీద పట్టరాని ఆగ్రహంకూడా వచ్చేది.

ఒకనాడు మాంత్రికుడికి ఆ దీపాన్ని, అలాదీన్ శవాన్ని కనీసం ఒకసారి చూసి సంతోషించాలని కోరిక కలిగింది. అందుకుగాను ఆయన ముగ్గులువేసి, మంత్రాలు చదివి, ముగ్గులమధ్య కూచుని అంజనం వేసి పరీక్షగా చూశాడు. ఆయనకు గుహ కనిపించిందిగాని అందులో దీపం లేదు, అలాదీన్ శవం అసలే లేదు!

మాంత్రికుడికి ఒళ్లంతా జెర్రులు పాకినట్టయింది. అలాదీన్ ఆ దీపంతోసహా ఆ గుహనుంచి బయటపడ్డట్టు ఆయనకు అర్థమయింది. ఆయన పళ్లు పటపటా కొరుకుతూ,

వి. ప్రసాదరావు



"ఓరీ దౌర్భాగ్యుడా! నన్నే ధిక్కరించి అద్భుతదీపం కాజేస్తావురా? చూడు నా తడాఖా!" అని అరిచాడు.

ఆయన ఆరోజే ప్రయాణంకట్టి, ఎక్కడా మజిలీ చెయ్యకుండా, నేరుగా చీనాదేశానికి వచ్చి, ముఖ్యపట్టణం చేరుకుని, ఒక సత్రంలో బసచేశాడు.

మాంత్రికుడు మర్నాడుదయమే నగరం నాలుగు మూలలా చూడటానికి బయలు దేరాడు. ఎక్కడికి వెళ్ళినా అలాదీన్ పేరు చెప్పుకునేవాళ్ళే! అలాదీన్ ఎంత అందగాడు! ఎంత గొప్పదాత! ఎంత సంపన్నుడు! మాంత్రికుడికి ఈ ప్రశంసలు వింటున్నకొద్దీ మండిపోయింది. "మీ నోళ్లతోనే మీరు అలాదీన్ చావు కోరుతారు, చూస్తూండండి!" అనుకున్నా డాయన.

ఊరువెంబడి తిరుగుతూ మాంత్రికుడు అలాదీన్ భవనం ఎదటికి వచ్చాడు. "దర్జీ వాడి కొడుక్కి ఇంత దశ పట్టిందిగా! కూటికి టికాణా లేనివాడివి ఐశ్వర్యవంతుడి వయావా? ఒరే అలాదీన్, మీ అమ్మచేత మళ్లీ నూలు వడికిస్తాను చూసుకో! నిన్ను పూడ్చేటందుకు గొయ్యి నాచేత్తో స్వయంగా తవ్వుతానురా!" అని ఆయన తన మనస్సులో ప్రజ్ఞలు పలికాడు.

ద్వారపాలకులను అడగగా అలాదీన్ చాలా రోజులక్రితం వేటకు బయలుదేరినట్టు తెలిసింది. ఇది విని మాంత్రికుడు చాలా సంతోషించాడు. ఎందుకంటే అలాదీన్ లేక పోయినట్టయితే తన పాచిక మరింత బాగా పారుతుంది. పోతే, అలాదీన్ దీపాన్ని ఇంటి దగ్గిర విడిచివెళ్లాడో, లేక తనవెంట తీసుకు పోయాడో తెలియలేదు.

ఈ విషయం తెలుసుకునేటందుకుగాను మాంత్రికుడు తన బసకు తిరిగివచ్చి అంజనంవేసి, దీపం అలాదీన్ భవనంలోనే ఉన్నట్టు తెలుసుకున్నాడు. ఆయనకు పట్ట రాని ఆనందం కలిగింది. ఆయన వెంటనే



రాగిపనివాళ్లుండే చోటికి వెళ్ళి, పన్నెండు రాగిదీపాలు కొనుక్కుని, వాటిని ఒక గంపలో పెట్టుకుని, "కొత్త దీపాలు! కొత్త దీపాలు! పాతదీపాలు తీసుకుని కొత్త దీపాలిస్తాం!" అని అరుచుకుంటూ అలాదీన్ ఇంటికేసి బయలుదేరాడు. మాంత్రికుడి నెత్తిన ఉన్న పెద్ద తలపాగా, అయన చేస్తున్న వింతబేరమూ వీధిలో ఆడుకునే కుర్రాళ్లను ఆకర్షించాయి; వారు ఆటలు మానేసి మాంత్రికుడి వెంట పడ్డారు.

అలాదీన్ భవనం చేరినాక మాంత్రికుడు ఆ ప్రాంతంలోనే తారట్లాడుతూ, "పాత దీపాలకు కొత్త దీపాలిస్తాం!" అని అరవసాగాడు. తొంభైతొమ్మిది కిటికీల బురుజులో ఉన్న రాజకుమార్తె మాంత్రికుడి అరుపులూ, పిల్లల కేకలూ విని బయటికి తొంగిచూసింది. ఇదంతా చూడగానే ఆమె నవ్వింది, ఆమె దాసీలుకూడా కిలకిలా నవ్వారు.

వారిలో ఒకతె తన యజమానురాలితో, "అమ్మా, నేను అయ్యగారి గది తుడిచేటప్పుడు అక్కడ పీటమీద పెట్టిఉన్న పాత రాగిదీపం ఒకటి చూశాను. దాన్ని తీసుకుపోయి ఆ దీపాలమ్మేవాడికి చూపించి, దానికి బదులుగా నిజంగా కొత్తదీపం ఇస్తాడేమో చూడనా?" అన్నది.

దాసీది చూసిన దీపం అద్భుతదీపమే. అలాదీన్ వేటకు బయలుదేరేముందు దాన్ని దాచటం మరిచాడు. విధిని తప్పించుకోవటం ఎవరికిమాత్రం సాధ్యమవుతుంది? రాజకుమార్తెకు, పాపం, ఆ దీపం గురించి కొంచెంకూడా తెలియదు. ఆమె దాసిదానితో, "అవునే! అలాగే చేద్దాం. మన పాతదీపాన్ని బానిసవాడిచేత పంపించి కొత్త దీపం అడగమని చెప్పు. ఆ పిచ్చిముండాకొడుకు నిజంగా కొత్తదీపం ఇచ్చాడా, మనం కలకాలం నవ్వుకోవచ్చు!" అన్నది.

దాసీది అలాదీన్ గదికి వెళ్ళి అక్కడఉన్న దీపాన్ని తీసుకుని ఒక బానిసకు ఇచ్చింది.



వాడు దాన్ని పట్టుకుపోయి మాంత్రికుడికి చూపి, "అమ్మగారు, ఈ దీపానికి కొత్త దీపం పట్టుకురమ్మన్నారు!" అన్నాడు.

మాంత్రికుడు అద్భుతదీపాన్ని గుర్తించి వణికిపోసాగాడు.

"కంగారుపడుతావెందుకు? ఈ దీపానికి కొత్తదీపం ఇవ్వవా?" అని అడిగాడు బానిస.

మాంత్రికుడు తన ఉద్రేకాన్ని నిగ్రహించుకుని, బానిస చేతిలోఉన్న అద్భుత దీపాన్ని లాక్కుని, తన గంప చూపించి, "నీ యిష్టంవచ్చిన దీపం తీసుకో," అన్నాడు.

బానిసవాడు రాగిదీపం ఒకటి తీసుకుని విరగబడి నవ్వుతూ వెళ్ళిపోయాడు.

ఈలోపల మాంత్రికుడు తన గంపనూ, అందులో మిగిలిన రాగిదీపాలనూ తనవెంట ఉన్న పిల్లల మూకమీద గిరవాటువేసి, అద్భుతదీపాన్ని పట్టుకుని ఒక నిర్జన ప్రదేశానికి వెళ్ళి, అక్కడ దీపాన్ని రుద్దాడు. వెంటనే దీపంభూతం ప్రత్యక్షమై, "ఏమి సెలవు?" అని అడిగింది.

"అలాదీన్ భవనాన్ని ఉన్నపాళంగా మొరాకో చేర్చు. అలాగే నన్నుకూడా ఆ భవనంలోకి చేర్చు!" అన్నాడు మాంత్రికుడు.

ఆయన కళ్ళు మూసి కళ్ళు తెరిచేసరికి అలాదీన్ భవనం, అందులో ఉండే సమస్త వస్తువులతోనూ, మొరాకో దేశంలో తోటల మధ్య ఉన్నది; మాంత్రికుడు ఆ భవనం లోపల ఉన్నాడు.

మర్నాడు ఉదయం రాజుగారు తన గది కిటికీనుంచి తన కూతురి ఇంటికేసి చూసి అక్కడ ఏమీ లేకపోవటం గమనించి నిర్ఘాంతపోయాడు. అలాదీన్ భవనం ఉండవలసిన చోట విశాలమైన మైదానం ఉన్నది; అందులో భవనం తాలూకు పునాదుల గోతులు మాత్రం ఉన్నాయి. భవనమేమో అదృశ్యమయింది.

"ఏమిటీ ఆశ్చర్యం? ఏం జరిగింది?" అని రాజుగారు మథనపడుతున్న సమ

యంలో, ఆయనను సభకు తీసుకుపోవటానికి మంత్రి వచ్చాడు. రాజు ఆయనతో, "మంత్రి, అమ్మాయి ఇల్లు ఏమయింది?" అని అడిగాడు. రాజుగారికి మతి చలించిందనుకుని, "అదేం ప్రశ్న, మహారాజా?" అన్నాడు మంత్రి.

"అయితే నీకేమీ తెలియదా?" అన్నాడు రాజు మరింత ఆశ్చర్యంగా.

"నాకేమీ తెలియదు, మహారాజా," అన్నాడు మంత్రి అయోమయంగా.

"నువు అలాదీన్ ఇంటిని చూడలేదన్న మాట. ఇప్పుడు చూడు," అన్నాడు రాజు, మంత్రిని కిటికీదగ్గిరికి లాక్కుపోయి.

"ఘోరం, ఘోరం! అలాదీన్ భవనం మాయమయింది! ఆ అలాదీన్ మంత్రగాడని ఇప్పుడైనా ఒప్పుకుంటారా, మహారాజా?" అన్నాడు మంత్రి.

రాజు ఆగ్రహావేశంతో, "ఆ నీచుడు, ఆ మంత్రగాడు, ఆ వంచకుడెక్కడ? అలాదీన్ ఎక్కడ?" అన్నాడు.

"మహారాజా, అతను వేటకు వెళ్ళాడు. ఇవాళే తిరిగి రావాలి! నే నతనికి ఎదురు వెళ్ళి ఆ భవనాన్ని ఏం చేశాడో తెలుసుకు రమ్మని శలవా?" అన్నాడు మంత్రి, తాను ఇంతకాలానికి అలాదీనమీద జయంసంపాయించినందుకు సంతోషిస్తూ.





"ఏమీ అవసరం లేదు. ఆ వెధవను చేతులూ కాళ్ళూ కట్టి నా దగ్గిరికి ఈడ్చుకు రమ్మని సర్దారుకు చెప్పు." అన్నాడు రాజు.

మంత్రి రాజాజ్ఞను సర్దారుకు తెలిపాడు. సర్దారు నూరుమంది భటులను వెంటబెట్టుకుని అలాదీన్‌కు ఎదురువెళ్ళాడు. నగర ద్వారం దాటి కొంతదూరం వెళ్ళేసరికి అలాదీన్ తగిలాడు. వెంటనే రాజభటులు అతన్ని చుట్టుముట్టారు.

సర్దారు అలాదీన్‌తో, "ఏలినవారు నన్ను క్షమించాలి, నేను రాజుగారి నౌకరును, ఆయన ఆజ్ఞ పాలించి తీరాలి. తమరికి సంకెళ్లు వేసి ఈడ్చుకు రమ్మని రాజుగారు నన్ను ఆజ్ఞాపించారు. మీకు ఎంతగానో ఋణపడి ఉన్నాను. అందుచేత నన్ను మీరు క్షమించాలి!" అన్నాడు.

ఆశ్చర్యంతో అలాదీన్ కాస్సేపు ఏమీ అనలేకపోయాడు. చివరకతను, "నేను చేసిన అపచారమేమిటో రాజుగారు చెప్పారా? ఎందుకంటే నేను ఆయనకుగాని, ఆయన రాజ్యానికిగాని ఎట్టి ద్రోహమూ చేసి ఎరగను!" అన్నాడు.

"నాతో రాజుగారు ఏమీ చెప్పలేదు," అని సర్దారు జవాబిచ్చాడు.

"అయితే మీ విధి మీరు నిర్వహించండి!" అంటూ అలాదీన్ తన గుర్రం మీదినుంచి దిగాడు. సర్దారు అతని చేతులు కట్టేసి, అతని నడుముకు గొలుసు కట్టి చేత పట్టుకుని తన గుర్రంమీద సవారీ చేస్తూ నగరానికి తిరిగివచ్చాడు.

సర్దారూ, రాజభటులూ అలాదీన్‌ను కట్టి తెస్తూ నగరంలో ప్రవేశించగానే ఈ దృశ్యం పౌరుల కంటబడింది. ఎందుకో రాజుగారు అలాదీన్‌ను శిరచ్ఛేదం చెయ్యబోతున్నారని వారు గ్రహించారు. వారికి అలాదీన్‌పై అంతులేని ప్రేమ. అందుచేత ప్రజలు కత్తులూ, బాకులూ, కర్రలూ, రాళ్ళూ తీసుకుని సర్దారు వెనకే నడవసాగారు. త్వరలోనే



ఈ గుంపు వందలసంఖ్య దాటి వేలసంఖ్యలో పడింది. క్షణక్షణానికీ వారి ఉద్రేకం రెచ్చిపోసాగింది.

నూరుమంది భటులున్నప్పటికీ సర్దారు అలాదీన్‌ను రాజప్రాంగణంలోకి తీసుకుపోవటం ఎంతో కష్టసాధ్యమయింది. ప్రజలు ఆకలిగొన్న తోడేళ్లలాగా ఉన్నారు. అలాదీన్ లోపల ప్రవేశించగానే వారు భయంకరంగా అరుస్తూ, "అలాదీన్‌ను విడిపించాలి!" అని నినాదాలు చేయసాగారు.

రాజు చాలా కోపోద్రేకంలో ఉన్నాడు. అలాదీన్ తన ఎదటికి రాగానే ఆయన జరిగినదానికి సంజాయిషీ అడగటానికి మారుగా, "ఈ దుర్మార్గుడి తల వెంటనే తీసెయ్యండి!" అని భటులకు ఉత్తరువిచ్చాడు.

తలారి వచ్చి అలాదీన్ సంకెళ్లు విప్పి, అతని కళ్లకు గంత కట్టి, వధ్యస్థానానికి తీసుకుపోయి, "మోకరించి దైవధ్యానం చేసుకో!" అన్నాడు. కాని అతను కత్తిఎత్తి అలాదీన్ తల తెగవేసే లోపుగా బయటవున్న ప్రజలు ప్రహరీగోడ ఎక్కి లోపలికి దూకసాగారు. కొందరు రాజద్వారాన్ని పగలగొట్టే ప్రయత్నాలు సాగించారు.

రాజు తలారితో, "ఆగు!" అన్నాడు. ఆయన సర్దారుకేసి తిరిగి, "అలాదీన్ తల తీసెయ్యటంలేదని ప్రజలతో చెప్పు," అన్నాడు. సర్దారు ప్రజలతో ఈ మాట చెప్పినమీదట ప్రజల ఆగ్రహం కొంత శాంతించింది. వారు ద్వారాన్ని పగలగొట్టే ప్రయత్నమూ, గోడలమీదికి పాకే యత్నమూ మానుకున్నారు.

అలాదీన్ కళ్లకు కట్టిన గంతలు విప్పారు. అతను లేచి నిలబడి గద్గద స్వరంతో, "మహారాజా, నాకింత అవమానం ఎందుకు చేశారో సెలవిస్తారా? నావల్ల జరిగిన అపరాధమేమిటి?" అని అడిగాడు.

"ఏమి అపరాధం జరిగినదీ నీకు తెలియదేం? చూపిస్తాను, నావెంట రా?"

అంటూ రాజు అలాదీన్‌ను రాజభవనం వెనకవేపుకు తీసుకుపోయాడు. అక్కడ తన భవనం లేకపోవటం అలాదీన్ గమనించాడు. అతని కళ్లు మసక అయిపోయాయి. అతని నోట మాట రాలేదు.

"పరమ నీచుడా, నా కూతురు ఏమయింది? నా ప్రాణానికి ప్రాణమైన కూతురు! నా ఏకైక పుత్రిక!" అన్నాడు రాజు ఆగ్రహంతో.

"మహారాజా, నే నేమీ యెరగను," అన్నాడు అలాదీన్.

"విను, నీ దిక్కుమాలిన భవనం నా కక్కర్లేదు. కాని నా కూతురిని వెంటనే నాకు చూపకపోయావో నీ తల తీసేస్తాను!" అన్నాడు రాజు.

"మహారాజా, విధిని తప్పించుకోగలమా? నేను చెయ్యని తప్పుకు నా తల అర్పించవలసివుంటే అర్పించే తీరాలి. కాని నా ప్రియమైన భార్యకోసం నేను వెతకవలిసి ఉంది. ఇందుకుగాను నాకు నలభై రోజులు గడువిప్పించండి!" అని అలాదీన్ మనవి చేసుకున్నాడు.

"గడువిచ్చాను, వెళ్ళు. కాని గడువు లోపల నా కూతురిని చూపలేకపోయావో, నువ్వెక్కడ వున్నా పట్టి తెప్పించి శిక్షిస్తాను. ఆ మాట జ్ఞాపకం ఉంచుకో!" అన్నాడు రాజు వుద్రేకంగా.

అలాదీన్ తల వంచుకుని బయటికి వెళ్ళాడు. అతనిప్పుడు గుర్తుపట్టేలాగ లేడు. దుఃఖంతో అతని రూపమే మారిపోయింది. అతను ఎదురుపడిన వారిని, "నా ఇల్లేమయింది? నా భార్య ఏమయింది?" అని అడగసాగాడు.

"రాజుగారి నిర్దయమూలాన అలాదీన్ మతి కాస్తా పోయింది, పాపం!" అనుకున్నారు ప్రజలు.

అలాదీన్ నేరుగా నగరం విడిచి వెళ్లిపోయాడు. —(ఇంకా వుంది)






9

[అద్భుతదీపం సహాయంతో రాజకుమార్తెను పెళ్లాడి, అద్భుతమైన భవనంలో హాయిగా జీవిస్తున్న అలాదీనుకు అనుకోకుండా కష్టకాలం దాపరించింది. అతను వేటకు వెళ్లిన సమయంలో మొరాకో మాంత్రికుడు వచ్చి అలాదీన్ భార్యకు కొత్త దీపం ఇచ్చి అద్భుత దీపాన్ని తీసుకుని, దాని సహాయంతో అలాదీన్ భవనాన్ని, రాజకుమార్తెనూ కూడా తన దేశానికి తీసుకుపోయాడు. రాజు అలాదీన్‌పై ఆగ్రహించి, తన కుమార్తెను నలభై రోజుల లోగా తెచ్చి చూపకపోతే తల తీయిస్తానన్నాడు. అలాదీన్ ఆ నగరం విడిచి పోయాడు.]

అలాదీన్ వెళ్లగా వెళ్లగా ఒక నది వచ్చింది. దాన్ని చూడగానే అతనికి అందులో దూకి ఆత్మహత్య చేసుకుని తన కష్టాలు అంతం గావించుకోవాలనిపించింది. ఎందుకంటే తన భార్య ఎక్కడ ఉన్నదీ అతనికి తెలియదు. ఆమెకోసం ఎలా వెతకటం?

అయితే మరుక్షణమే తన తప్పు తెలిసి వచ్చింది. భగవంతుడు చేసిన నిర్ణయాలను గురించి వితర్కించటానికి తనకు అధికారంలేదని, ఆత్మహత్య మహాపాతకమని అతను జ్ఞాపకం చేసుకున్నాడు. దానితో అతని గుండెబరువు తగ్గినట్టయింది.

అలాదీన్ ఆత్మహత్యాప్రయత్నం మాని నదిలోకి దిగి, స్నానంచేసి, దోసిట నీరు తీసి విడిచి, చేతులు రుద్దుకున్నాడు. అతను అనుకోకుండా తన వేలిఉంగరాన్ని రుద్దేసరికి ఉంగరంభూతం భయంకరాకారంతో ప్రత్యక్షమై, "ఏమి సెలవు?" అని అడిగింది.

వి. ప్రసాదరావు



అలాదీన్ మొదట విభ్రాంతిపోయి, తరవాత తెప్పరిల్లుకుని పరమానందంతో, "ఓ భూతమా, నా భవనాన్నీ, అందులో వున్న నా భార్యనూ తిరిగి నాకు చేర్చు!" అన్నాడు.

"దీపంభూతాన్ని ధిక్కరించి నేనా పని చెయ్యటం సాధ్యంకాదు, యజమానీ!" అన్నది ఉంగరంభూతం.

"అలా అయితే కనీసం నన్ను నాభార్య ఉండే ఇంటిపక్కనైనా దిగబెట్టు!" అన్నాడు అలాదీన్.

అతని మాట అతని నోట వుండగానే ఉంగరంభూతం అతన్ని మొరాక్కో తీసుకుపోయి అతని భవనంపక్కన దింపింది.

సరిగా అదేసమయానికి, ఏ దేవుడో ప్రేరేపించినట్టుగా, ఒక దాసిది కిటికీ తెరిచి రాజకుమార్తెతో, "అమ్మగారూ, ఈ సాయంకాలం ఎండలో తోట ఎంత అందంగా ఉందో చూశారా?" అన్నది.

ఇంతలోనే దాసికి అలాదీన్ కనిపించాడు. అది గట్టిగా కేకపెట్టి, "అమ్మా, అదుగో అయ్యగారు!" అన్నది.

రాజకుమార్తె కిటికీవద్దకు పరిగెత్తుకు వచ్చింది. భార్యాభర్తలిద్దరూ ఒకరినొకరు చూసుకుని దిగ్భ్రమ చెందారు. రాజకుమార్తె తన ఆశ్చర్యాన్ని అణుచుకుని, "త్వరగా లోపలికి రండి! ఏమీ భయంలేదు. మాంత్రికుడు ఎటో వెళ్ళాడు," అన్నది.

దాసిది వెళ్ళి ఒక రహస్యద్వారం తెరిచింది. అలాదీన్ లోపలికి వచ్చి తన భార్యను ఆలింగనం చేసుకున్నాడు. ఇద్దరూ కాస్సేపు ఆనందంతో కన్నీరు కార్చారు.

అలాదీన్ తన భార్యతో, "నేను వేటాడటానికి వెళ్ళేటప్పుడు నాగదిలో బల్లమీద ఒక రాగిదీపం పెట్టాను. అది ఏమయింది? కనబడలేదు," అన్నాడు.

"అదే మన కొంప తీసింది. తప్పు పూర్తిగా నాదికూడా కాదు," అంటూ రాజకుమార్తె జరిగిన సంగతి అంతా చెప్పి,

"ఇక్కడికి వచ్చాక ఆ దొంగవెధవ నాకా దీపం శక్తి ఏమిటో చెప్పాడు. దాని శక్తి తోనే మన భవనాన్ని ఇక్కడికి తీసుకువచ్చి నట్టుకూడా చెప్పాడు," అన్నది.

"ఆ మాంత్రికుడికి నీతో ఏం పని?" అని అడిగాడు అలాదీన్.

"రోజూ నాదగ్గిరికి వచ్చి నా మనస్సు తనవైపు తిప్పటానికి ప్రయత్నిస్తాడు. అందుకుగాను నాతో చాలా విషయాలు చెప్పాడు. మా నాన్న నీ తల తీయించాడని చెప్పాడు. మీ తండ్రి ముస్తఫా అనే ఒక పేద దర్జీవాడని, తన దయవల్లనే నువ్వు ఇంతవాడి వయావని చెప్పాడు. వాడు ఎంతసేపు మాట్లాడినా నేను కొల్లంగొట్టిన రాయిలాగా ఉండిపోతున్నాను. అందుచేత వాడు మోహం వేళ్లాడేసుకుని వెళ్ళిపోతున్నాడు. కాని వాడు నన్నెక్కడ బలాత్కారిస్తాడో అని భయపడి చస్తున్నాను. ఇంతలోనే దేవుడి దయవల్ల నువ్వు వచ్చేశావు!" అన్నది రాజకుమార్తె.

అలాదీన్ తల ఆడించి, "అయితే వాడా దీపాన్ని ఎక్కడ దాస్తాడో నీకు తెలుసా?" అని అడిగాడు.

"వాడు దాన్ని ఎక్కడా దాయడు. చొక్కాలోపల కట్టుకు తిరుగుతాడు," అన్నది రాజకుమార్తె.



"మరి మంచిది. నువ్వు కాస్సేపు అవతలికి వెళ్లు!" అన్నాడు అలాదీన్. రాజ కుమార్తె అవతలికి వెళ్లగానే అతను తన ఉంగరాన్ని రుద్దాడు. ఉంగరంభూతం ప్రత్యక్షమై, "ఏమి సెలవు?" అన్నది.

"నీకు ఘాటైన విషాలేమైనా తెలుసునా?" అని అలాదీన్ భూతాన్ని అడిగాడు.

"ఓ, చాలా తెలుసు!" అన్నది భూతం.

"అయితే, ఏనుగును కూడా క్షణంలో పడగొట్టగల కాలకూటం పట్టుకురా!" అన్నాడు అలాదీన్.

భూతం అదృశ్యమై ఒక క్షణంలో ఒక పొట్లం తెచ్చి అలాదీన్‌కు ఇచ్చింది.

భూతాన్ని పంపేసి అలాదీన్ తన భార్యను పిలిచాడు. ఆమె చేతికి పొట్లం ఇచ్చి, మాంత్రికుడు వచ్చినప్పుడామె ఏమి చెయ్యాలో వివరంగా చెప్పాడు. తరవాత అతను ఒక అలమారులో దూరి దాక్కున్నాడు.

అలాదీన్ తనపై పెట్టిన పని రాజ కుమార్తెకు ఎంతమాత్రమూ ఇష్టంలేదు. అయినా అతని ఆజ్ఞప్రకారం ఆమె తన దాసీలను పిలిచి తన జుట్టు దువ్వించుకుని, అందంగా ముడి వేయించుకున్నది. తన చీరె లన్నిటిలోకీ అందమైన చీరె కట్టుకుని రత్నాల వడ్డాణం పెట్టుకున్నది. తన మెడకు





ముత్యాల జేవ చుట్టుకున్నది. కాళ్ళకూ, చేతులకూ రత్నాభరణాలు పెట్టుకున్నది. ఏడు రకాల అత్తరులు పూసుకుని దేవతా స్త్రీలాగా తయారై మాంత్రికుడి రాకకు ఎదురుచూస్తూ హంసతూలికాతల్పం పై పడుకున్నది.

మామూలు వేళకు మాంత్రికుడు వచ్చాడు. రాజకుమార్తె లేచి చిరునవ్వు నవ్వుతూ ఎదురువెళ్ళి, వచ్చి కూచోమని ఆహ్వానించింది. మాంత్రికుడు ఆనందాశ్చర్యాలతో ఒక ఆసనంమీద కూచున్నాడు.

"నాలో మార్పు మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. కాని, చనిపోయిన భర్తకోసం ఇంకెన్నాళ్ళు ఏడవను? నాకు ఆనందం కావాలి. నేనెన్నడూ కష్టాలు ఎరిగినదాన్ని కాను. మనను కష్టపెట్టుకుంటే పోయిన వారు వస్తారుగనకనా!...నా తెలివి తెల్లవారా! కబుర్లలో పడి మీకు తాగటానికివ్వటం కూడా మరిచాను!" అంటూ రాజకుమార్తె ఒక బల్లవద్దకు వెళ్ళి, మాంత్రికుడికి వీపు పెట్టి నిలబడి ఒక గ్లాసులో విషంవేసి, షర్బతు పోసి మాంత్రికుడికి దాసిచేత ఇప్పించింది.

"నీ చిరునవ్వులో ఉన్న మాధుర్యంతో పోలిస్తే ఈ షర్బతు తీపి ఏపాటి?" అంటూ మాంత్రికుడు షర్బతు తాగేసి, మరుక్షణం దుంగలాగా తివాసీపై విరుచుకు పడిపోయాడు.

మాంత్రికుడు పడిపోయిన చప్పుడు వినగానే అలాదీన్ తాను దాగిఉన్న చోటునుంచి బయటికి వచ్చాడు. మాంత్రికుడి ప్రాణాలు పోయినట్టు రూఢి చేసుకుని, ఆయన చొక్కా లోపలినుంచి అద్భుతదీపాన్ని పైకి తీశాడు. తరవాత అతను తన భార్యను అవతలికి పంపి, దీపాన్ని రుద్దాడు. భూతం ప్రత్యక్షమై, "ఏమి సెలవు?" అని అడిగింది. "ఈ భవనాన్ని ఉన్నపాళంగా యథాస్థానానికి చేర్చు!" అన్నాడు అలాదీన్.



మరుక్షణం అలాదీన్ భవనం యథాస్థానం చేరుకున్నది. అలాదీన రాజకుమార్తెను పిలిచి, "మనం మళ్లీ ఇంటికి వచ్చేశాం. కాని ఈ రాత్రివేళ మీ నాన్నను చూడటం అంత బాగుండదు. రేపు చూద్దాం!" అన్నాడు.

ఎడబాటు కలిగినాక ఆ భార్యాభర్తలు నిద్రాహారాలు విసర్జించారు. ఇప్పుడు వారిద్దరూ సుఖంగా భోజనం చేసి నిశ్చింతగా నిద్రపోయారు.

మర్నాడు తెల్లవారింది. తెల్లవారుతూనే తన కూతురికోసం ఒక శోకం పెట్టటం రాజుగారికి అలవాటు. ఆయన కిటికీలోనుంచి బయటికి చూసేసరికల్లా అలాదీన్ భవనం యథాస్థానంలో కనిపించింది.

ఆయన సంతోషంతో పిచ్చివాడులాగా అయిపోయి పరిగెత్తుకుంటూ వెళ్లి అలాదీన్ భవనాన్ని చేత్తో తాకి చూశాడు. అది భ్రమ కాదు. భవనం చేతికి గట్టిగానే తగిలింది. ఆయన మెట్లమీదుగా దూకుతూ వెళ్లి అలాదీన్, తన కూతురూ ఉన్న చోటు చేరుకుని, తన కూతుర్ని ప్రేమతో కౌగలించుకుని ఆనందబాష్పాలు రాల్చాడు.

"అమ్మా, నిన్ను మళ్లీ ఎప్పటిలాగా చూస్తాననుకోలేదు. పైకి కనిపించకపోయినా నువ్వు చాలా యమయాతన అనుభవించి ఉంటావు. నన్ను విడిచి ఒక్కక్షణం ఉండలేవుగదా! ఏం జరిగిందో విపులంగా చెప్పు!" అన్నాడాయన తన కుమార్తెతో.

రాజకుమార్తె జరిగినదంతా చెప్పి, "తప్పు నిజంగా నాదే. నాది కానివస్తువు మరొకరికి ఎందుకివ్వాలి?" అన్నది.

తరవాత అలాదీన్ రాజుగారికి మాంత్రికుడి శవాన్ని చూపి, "ఇడుగో, మా కష్టాలన్నిటికీ కారకుడు! వీడు నరకంలో తప్పక అనుభవిస్తాడు!" అన్నాడు.

రాజుగారు అలాదీన్ నిర్దోషి అని గ్రహించి అతన్ని కౌగలించుకుని, "నాయనా, నీపట్ల

కఠినంగా ప్రవర్తించానని నీ మనసులో కష్టపెట్టుకోకు. నాకు మా అమ్మాయి అంటే అంత ప్రాణం! ఆ విషయం ఇతరులు గ్రహించినా గ్రహించకపోయినా నువ్వు గ్రహించాలి. దానికోసం నేను రాజ్యమైనా ఇచ్చేస్తాననుకో!" అన్నాడు.

"మీ తప్పేమీ లేదులెండి. నామూలానే మీ కుమార్తె పోయిందనుకున్నారు. ఒక విధంగా అది నిజమేకూడాను. ఎందుచేతనంటే మాంత్రికుడు అద్భుతదీపం మీద కన్నువేసి ఉంచుతాడని, ఏదో మాయోపాయం చేసి దానిని సంగ్రహించుతాడని నేను ముందుగానే ఊహించి తగు జాగ్రత్త పడవలసింది. నా చరిత్ర అంతా తీరుబడిగా మీకు చెబుతాను. అప్పుడుగాని ఈ మాంత్రికుడి దుర్మార్గం మీకు బోధపడదు," అన్నాడు అలాదీన్.

"ముందు ఈ దుర్మార్గుడి శవాన్ని వదిలించుకో!" అన్నాడు రాజు. అలాదీన్ తన సేవకులను పిలిచి, "ఈ శవాన్ని పిడకల పోగుపైన పెట్టి దహించి, బూడిదను మురుగు చెరువులో వేయించండి!" అని వారికి ఉత్తరువిచ్చాడు.

ఈ వార్తలు నగరంలో తెలిశాయి. అలాదీన్ క్షేమంగా రాజకుమార్తెతో తిరిగివచ్చినందుకు ప్రజలు సంతోషించారు. మాంత్రికుడి దహనసంస్కారాన్ని వేడుకగా చూడటానికి వారు గుంపులు గుంపులుగా వచ్చారు.

రాజుగారు నగరమంతటా ఉత్సవాలు జరపమని చాటింపు వేయించారు. ఖైదీ లందరినీ విడిచిపెట్టారు. పేదలకు దానధర్మాలు చేశారు. ఆ రాత్రి రెండు భవనాలలోనూ దీపాలు అలంకరించి వైభవంగా బాణాసంచా కాల్చారు.

మళ్ళీ అలాదీన్ కష్టాలు గట్టెక్కాయి. అతను తన భార్యతోనూ, వృద్ధురాలైన తల్లితోనూ సుఖంగా జీవించసాగాడు.

—(ముగింపు వచ్చే సంచికలో)






## 10

[రాజకుమార్తె అజ్ఞానంవల్ల అద్భుతదీపాన్ని కోల్పోయిన అలాదీన్ తన ఉంగరంలోని భూతం సహాయంతో, మొరాకోలో ఉన్న తన భార్యను చేరుకుని, మాయోపాయంచేత మాంత్రికుణ్ణి హతమార్చి, తన భార్యనూ, భవనాన్నీ తెచ్చుకుని, తిరిగి రాజుగారి మన్నన లకు పాత్రుడై సుఖంగా ఉంటున్నాడు. అతని కష్టాలన్నీ గట్టెక్కినట్టే కనపడ్డాయి. కాని—]

కొద్దిమాసాలు గడిచాయి. ఒక పేద దర్జీ వాడి కొడుకుగా జీవితం ప్రారంభించిన అలాదీన్ మహారాజులకుకూడా లేని వైభోగాలతో తులతూగుతూ, తన భార్యతోనూ, తల్లితోనూ సుఖంగా కాలం గడుపుతున్నాడు.

ఒకనాడతను తన భవనంలోని స్ఫటిక శాల గవాక్షంవద్ద నిలబడి తోటను చూస్తూన్నసమయంలో అతని భార్య వచ్చి అతని చెంత నిలబడి, "భగవంతుడి అనుగ్రహంవల్ల మనకే లోటూ లేదుగాని, మనకు పిల్లలు కలిగే జాడలేమీ లేకపోవటం నన్ను బాధిస్తున్నది. ఈ నగరానికి ఫత్మా అనే ఒక యోగిని వచ్చివున్నదట. ఆమె తాకితే ఎంతటి గొడ్రాళ్లకూ పిల్లలు పుడుతారట. ఆమెను ఒకసారి మన ఇంటికి పిలిపిస్తామా?" అని అడిగింది.

అలాదీన్ ఇందుకు సమ్మతించటమేగాక, ఆ యోగినిని తన ఇంటికి తీసుకురావటానికి నలుగురు బానిసలనుకూడా పంపాడు. యోగిని వచ్చింది. ఆమె ముఖం కప్పుకుని

వి. ప్రసాదరావు



వున్నది. ఆమె మెడలో మూడుపేటల రుద్రాక్షమాలలున్నాయి.

రాజకుమార్తె యోగినికి ఎదురువెళ్లి నమస్కారం చేసింది. యోగిని ఆమెను ఆశీర్వదించింది. రాజకుమార్తె ఆమెను సగౌరవంగా కూచోబెట్టి, "అమ్మా, మీ ఆశీర్వాదం ఊరికే పోదు. ఎందుకంటే మీ వంటి భక్తుల మాటలు భగవంతుడు ఆలకిస్తాడు. నాకొక్క చిన్న కోరిక వున్నది. నాకు పిల్లలు కావాలి. అందుకోసం నేనేం చెయ్యాలో సెలవియ్యండి. ఏమిచెయ్యటానికైనా నేను సిద్ధంగానే వున్నాను. నాకీ ఉపకారం చేశారంటే మీకు ఎన్నో బహుమానాలిస్తాను. ఇలాంటి వాటితో మీకు ఏమీ నిమిత్తం లేదని నేనెరుగుదును. నేనిచ్చే బహుమానాలు ఒకవేళ మీకు పనికిరాకపోతే మీ ఆదరానికి పాత్రులైన పేదసాదల కివ్వవచ్చు," అన్నది.

రాజకుమార్తె ఈవిధంగా మాట్లాడుతుంటే యోగిని కళ్లలోకి ఒక వికృతమైన కాంతి వచ్చింది. ఆమె ముఖం జేవురించింది. ఆమె శరీరంలో ఏదో ఒక ఆనందం ఉబికివస్తున్నట్లుగా కనబడింది. ఆమె నోరు విప్పి ఏమీ అనకుండా, తన చేతులను రాజకుమార్తె నెత్తినపెట్టి, ప్రార్థన చేస్తున్నదానిలాగా గొణిగింది. ఆతరవాత ఆమె, "రాజకుమారీ, భగవంతుడి దయవల్ల నీవు పిల్లల తల్లివి కావటానికి ఒక ఉపాయం తోచింది గాని, దాన్ని ఆచరించటం నీకు అసంభవమనుకుంటాను," అన్నది.

రాజకుమార్తె యోగిని కాళ్లపైబడి, "తల్లీ, నాభర్త అయిన అలాదీన్‌కు అసాధ్యమంటూ ఏమీలేదు. నేను ఏంచెయ్యాలో చెప్పండి. లేకపోతే మీ పాదాలదగ్గిరే నా ప్రాణాలు కాస్తా పోతాయి" అన్నది.

యోగిని ఒకవేలు ఎత్తిపట్టి, "అమ్మాయీ, నీకు పిల్లలు కలగాలంటే అందుకు ఒకటే మార్గం వున్నది. కాకసస్ పర్వతశిఖరాలలో



ఉండే గండభేరుండ పక్షియొక్క గుడ్డును తెచ్చి మీ బురుజులో వేలగట్టించు. దాని కేసి రోజూ చూస్తూవచ్చావంటే నీకు తప్పక గర్భం నిలిచి పిల్లలు కలుగుతారు. ఇదే నా సలహా!" అన్నది.

"తల్లీ, నాకు గండభేరుండపక్షి ఏమిటో, దాని గుడ్డేమిటో తెలియదు. కాని అటు వంటిది ప్రపంచంలో ఎక్కడ ఉన్నా దాన్ని నా భర్త తప్పక తీసుకురాగలడని నా నమ్మకం. ఆయన ఎన్నో అద్భుతాలు చేయ గలడు," అన్నది రాజకుమార్తె.

యోగిని వెళ్ళిపోవటానికి లేచింది. ఆ పూటకు తన ఆతిథ్యం స్వీకరించమని రాజ కుమార్తె ఆమెను ప్రాధేయపడింది. కాని యోగిని వినక, "ఇంకా ఎందరో అభాగ్యులు నాకోసం వేచివున్నారు. వారి కోరికలు నెర వేర్చాలి, వారి కష్టాలు తొలగించాలి. కాని దైవానుగ్రహం ఉంటే రేపు మళ్ళీ కనిపించి నీ క్షేమసమాచారాలు తెలుసుకుంటాను!" అని తొందరగా వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయిన కొంతసేపటికి అలా దీన్ తిరిగివచ్చి తన భార్యముఖాన విచార చ్ఛాయ ఉండటం గమనించి, "ఏం జరిగింది? ఎందుకు అలా విచారంగా ఉన్నావు?" అని ఆత్రంగా అడిగాడు.

"కాకసస్ పర్వతాలమీదినుంచి గండ భేరుండపక్షి గుడ్డు వెంటనే తెప్పించండి. లేకపోతే నా ప్రాణాలు నిలవవు," అన్నది రాజకుమార్తె.

అలాదీన్ నవ్వుతూ, "వెర్రిదానా, నీ ప్రాణాలు అంత సులువుగా నిలిచేటట్టయితే నువ్వు ఆదుర్దాపడవలసిన అవసరంలేదు. ఆ గుడ్డు ఇప్పుడే తెప్పిస్తాను. కాని దానితో ఏంచెయ్యబోతున్నావు?" అని అడిగాడు.

"దాన్ని మన బురుజులోపల వేళ్ళాడ గట్టి రోజూ దానికేసి చూస్తుండమని యోగిని చెప్పింది. అలా చేస్తే పిల్లలు పుడతారట," అన్నది రాజకుమార్తె.

"సరే, దాన్ని ఇప్పుడే తెప్పిస్తాను!" అన్నాడు అలాదీన్.

అతను తన గదిలోకి వెళ్ళి అద్భుతదీపాన్ని పైకితీసి, రుద్దాడు. భూతం ప్రత్యక్షమై, "ఏమిసెలవు?" అన్నది.

"కాకసస్‌పర్వత శిఖరాలపైన వుండే గండభేరుండపక్షి గుడ్డు వెంటనే కావాలి, తీసుకురా!" అన్నాడు అలాదీన్.

ఈ మాటలు అలాదీన్ నోటినుంచి వెలువడ్డాయో లేదో, దీపంభూతం శివం ఎత్తినట్టు కంపించిపోతూ, భవనమంతా దద్దరిల్లేటట్టుగా ఒక పెద్ద బొబ్బపెట్టి, "మూర్ఖుడా! పరమనీచుడా! ఏమిటి నువ్వనేది? మా భూతాలకు రాణైన గండభేరుండ పక్షి సంతానాన్ని తీసుకురమ్మంటావురా? ఉంగరం రక్షిస్తూ వుండకపోతే ఈపాటికి నిన్ను భస్మపటలం చేసివుందును," అని అరిచింది.

అలాదీన్ కంగారుపడ్డాడు. "భూతమా, నాపైన ఆగ్రహించకు. నిన్నీపని చెయ్యమన్నది నాకోసం కాదు, నా భార్యకోసం. ఒక గొప్ప సిద్ధురాలు చెప్పగా నా భార్య సంతానాభిలాషతో ఈ కోరిక కోరింది. అందుచేత మాపై ఆగ్రహించకు," అన్నాడు.



వెంటనే భూతం శాంతించి, "ఓ అలాదీన్, ఇది నీ కోరిక కాకపోవటం మంచిదయింది. ఈ ఆలోచన మరొక నీచుడిది. లేకపోయినట్టయితే నువ్వూ, నీ భార్యా, నీ భవనమూ సర్వనాశనమై ఉండవలసిందే. నువ్వు సిద్ధురాలని చెప్పే మనిషి మరెవరో కాదు, మొరాకో మాంత్రికుడి తమ్ముడు. చూడటానికి వాడు మూర్తులా అన్నలాగే ఉంటాడు. దుర్మార్గంలో అన్నకు ఏమీ తీసిపోడు. తన అన్న నీ చేతిలో చచ్చాడని తెలిసి, నీపై పగ తీర్చుకునేటందుకు వాడు మొరాకో నుంచి వచ్చి, ఈ ఎత్తు వేశాడు. ఈ రహస్యం నీకు చెప్పేశాను గనక నువ్వు వాడి విషయంలో సావధానుడవై ఉండు!" అని చెప్పి, అంతర్ధానమయింది.

అలాదీన్ మండిపడ్డాడు. అతను తన భార్య వద్దకు తిరిగివెళ్లి, "గండభేరుండపక్షి గుడ్డును తెప్పించేలోపుగా ఆ యోగిని చెప్పి దేమిటో నేను స్వయంగా వినటం చాలా అవసరం. అందుచేత ఆమెను ఇంకొకసారి పిలిపిస్తావా? ఆమె వచ్చేసరికి నేను తెరల వెనక దాగి ఉంటాను. ఆ గుడ్డుతో ఏం చెయ్యాలో మరొకసారి ఆమెచేత చెప్పించు. ఆవిడ మొదట చెప్పిన విషయాలు మరిచి పోయానని చెప్పు," అన్నాడు.

రాజకుమార్తె అలాగేనని యోగినికోసం కబురుపంపింది. యోగిని వచ్చింది. ఆమె రాజకుమార్తెను సమీపించే సమయంలో అలాదీన్ తెరవెనకనుంచి ఆ కపటయోగిని పైకి ఒక్క దూకు దూకి, తన కత్తితో ఆ మాయావి తల కిందపడగొట్టాడు.

"అయ్యో, అన్యాయంగా యోగినిని చంపి, ఎంత పాపకార్యం చేశారు!" అని రాజకుమార్తె ఆవేశంతో అన్నది.

అలాదీన్ చిరునవ్వు నవ్వి, తెగి పడి పోయిన యోగిని తలమీదినుంచి ముసుగు తొలగించాడు. ఆ ముఖాన గడ్డాలూ, మీసాలూ ఉండటం చూసి రాజకుమార్తె ఆశ్చర్యపడింది, భయపడిందికూడా.

అలాదీన్ ఈ మాయయోగినిని గురించి వివరంగా చెప్పి, "భగవంతుడు మనపట్ల దయగా ఉండబట్టే ఈ ఆఖరు శత్రువును కూడా వదిలించుకోగలిగాం. ఇక మనం ఎవరికీ భయపడవలిసిన అవసరం లేదు. ఇంతటితో మన కష్టాలు నిజంగా తీరిపోయి నట్టే!" అన్నాడు.

ఆతరవాత అలాదీన్‌కు చాలామంది పిల్లలు కలిగారు.

ముసలిదైపోయిన అలాదీన్ తల్లి ఎంతో మంది మనమలనూ, మనమరాళ్లనూ ఎత్తుకున్నది. వారంతా చాలా కాలంపాటు సుఖంగా జీవితం వెళ్లబుచ్చారు.

—[ అయిపోయింది ]

